# మన వివేకానందుడు









750/RDP

శ్రీ మాతాజీ
త్యాగీశానందపురీ



# శ్రీ మాతాజీ త్యాగీశానందుల గ్రంథములు

## (1) మన శారదామాయి

2-వ ముద్రణము 1/8 క్రా: 124 పుటలు రు 1-00

1. శ్రీ శారదామాయి పవిత్ర జీవిత విశేషాలు, సందేశాలు తేటతెలుగులో వ్రాసి ఉన్నాయి. ప్రతివారూ చదువవలసిన గ్రంథం. (ఆంధ్రప్రభ)
2. శ్రీ శారదాదేవి జీవిత చరిత్రము తెలియగోరు వారికి అవశ్య పఠనీయము. (కృష్ణాపత్రిక)
3. శ్రీ శారదామాయి యొక్క సర్వతో ముఖా దర్శము యిందు సాధకులకు స్పష్టముగా గోచరించును. (గోలకొండపత్రిక)

## (2) మన వివేకానందుడు

2-వ ముద్రణము 1/8 క్రా: 116 పుటలు రు 1-00

1. శ్రీ మాతాజీయే మనోరంజకమైన శైలిలో రచించారు. (ఆంధ్రప్రభ)
2. సులభమైన శైలిలో ఉత్తేజకరంగా వ్రాయబడినది. (గోలకొండపత్రిక)
3. ఎల్లరిచేతనూ 'మాతాజీ' యని ఆప్యాయంగా పిలువబడు ఈ కుమారి యందు, శ్రీరామకృష్ణ వివేకానందులెట్టి ఉత్సాహమును పూరించారో ఈ రచనయందు పొడగట్టుతుంది. (కృష్ణాపత్రిక)

## (3) మన రామకృష్ణుడు

2-వ ముద్రణము 1/8 క్రా: 130 పుటలు రు 1-00

1. సాధన ద్వారా అనుభూతి పొందగోరు ముముక్షువులేగాక సామాన్యులు గూడ యిది చదివిన సంతృప్తులు కాగలరు. (గోలకొండపత్రిక)
2. చక్కని సులభ శైలిలో రచించిరి. (విశ్వమీమాంస)

# మన వివేకానందుడు



రచయిత్రి

శ్రీ శ్రీ మాతాజీ త్యాగీశానందపురి



ప్రకాశకులు

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల (గుంటూరు జిల్లా)

భీమునిపట్టణము (విశాఖ జిల్లా)

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

ఉద్దేశ్యము :- ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారిచేతను యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము :- సంవత్సరమునకు మొత్తమునకు రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

విరాళము :- 1) రు 500/- మించు విరాళ మొసంగువారు మహారాజ పోషకులు. ఒక ముఖ్య గ్రంథమున వీరి ఫొటో ప్రకటింప బడును. వీరి నామములు ప్రతిపుస్తకమున ముద్రింపబడుచుండును. గ్రంథ మాల ప్రచురణములన్నియు నుచితముగ వీరి కొసంగబడును.

2) రు 100/- మించు విరాళ మొసంగువారు రాజపోషకులు. ప్రతి గ్రంథమున వీరి నామములు ముద్రింపబడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుకూడ నుచితముగ బడయుదురు.

3) రు 50/- మించు విరాళ మొసంగువారు పోషకులు. వీరి నామ ములు అన్ని ప్రచురణముల ప్రకటింపబడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.

4) రు 25/- మించు విరాళ మొసంగువారు మిత్రులు. ప్రచురణముల 3/4 ధరలకు బొందుదురు.

5) రు 10/- మించు విరాళ మొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/3 తగ్గింపు ధరలకు బొందుదురు.

గ్రంథమాలయొక్క మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి తోడ్పడుదురుగాక.

# విరాళకర్తలు

## మహారాజపోషకులు

### రు. 516/-

1 శ్రీ బలభద్రుని చెన్నయ్యశెట్టిగారు & సన్స్, కమీషన్ మర్చంట్సు, ఆయిల్ మిల్సు, భీముని

2 శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు & సన్, శ్రీ వెంకటేశ్వ ఆయిల్ మిల్సు, భీముని

3 శ్రీ నందగిరి వేంకట రామదాసు పంతులుగారు & సన్స్, శిర్లపాలెము, భీముని

## రాజపోషకులు

### రు. 100/-

1 శ్రీ మొంటా ఈశ్వరయ్యగారు, కమీషన్ మర్చంట్సు, నెల్లూరు.

2 పసుపర్తి శేషాచలం శెట్టి గారు, క్లాత్ మర్చంట్సు.

3 నూనె శేషాచలంశెట్టిగారు, రైసుమిల్సు, & కమీషన్ మర్చంట్సు.

4 నూనె అగ్గయ్యశెట్టిగారు, రైసుమిల్సు, & కమీషన్ మర్చంట్సు.

5 చిత్తూరు మునుస్వామి మొదలియార్ గారు, కమీషన్ మర్చంట్సు.

6 యల్లపల్లి గోవిందు శెట్టిగారు, బిరన్ & ఫట్రైసర్సు.

7 గాలి నారాయణరావు గారు M. A., L. T., రిటైర్డు ప్రిన్సిపాల్, కర్నూలు ఉస్మానియ

8 కొత్తూరి రామయ్య, కర్పూరపు రామకృష్ణమూర్తి కంపెని, టుబాకో మర్చంట్సు.

9 పోలిశెట్టి సోమసుందరంగారు, టుబాకో మర్చంట్సు.

10 శ్రీ కర్పూరపు వెంకటనారాయణగారు, టుబాకో మర్చంట్సు.
11 వంకాయల కోటేశ్వరుడుగారు, టుబాకో మర్చంట్సు.
12 కర్పూరపు కనకవల్లి తాయారమ్మగారు.
13 ద్విభాష్యం అన్నపూర్ణయ్యగారు.
14 బొలిసెట్టి సీతారామయ్యగారు, అడ్వోకేటు, బాపట్ల. రు 232
15 బూసరాజు వేం. నరసింహారావుగారు, వైద్యులు, స్వర్ణ.
16 బొడ్డుపల్లి సీతారామస్వామి శాస్త్రిగారు, కర్లపాలెం.
17 మంతెన వేంకట రామరాజుగారు B. A., బుద్దాం. రు 116
18 పురిపాక సూర్యప్రకాశరావుగారు, కరణం, అమృతలూరు.
19 వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, బచ్చుపేట, బందరు. రు 116
20 కల్లూరి వేంకట సూర్యనారాయణగారు, వకీలు.
21 యద్దనపూడి రామచంద్రరావుగారు.
22 తాడంకి వేంకటకృష్ణారావుగారు, అడ్వోకేటు.
23 మోటుమర్రి దయానిధిగారు.
24 తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు, మెడికల్ షాపు.
25 చిత్రపు అచ్యుతరామయ్యగారు.
26 దీవి సేతు మాధవాచార్యులుగారు.
27 అద్దేపల్లి వేంకటరామయ్యగారు.
28 పిన్నమనేని లింగయ్య చౌదరిగారు, అడ్వోకేటు. రు. 116
29 జగర్లపూడి వేంకటేశ్వర్లుగారు. విజయవాడ.
30 బొమ్మదేవర హేమలతాదేవి బహద్దర్ వారు. ఏలూరు.
31 చావలి సీతారామయ్యగారు, అగ్రికల్చరల్ ఇంజనీయరు.
32 బండి వీరరాఘవమ్మగారు, చింతలపూడి.
33 బండి రామారావుగారు.
34 మంచిరాజు చిన వేంకటరత్నంగారు, భీమడోలు.
35 మావులేటి సోమరాజుగారు, గుండుకొలను.
36 దుర్గంపూడి ధర్మరాజుగారు.
37 భీమవరము వర్తకసంఘభవన గ్రంథాలయము, భీమవరము.
38 ఇమ్మిడి సత్యనారాయణగారు, కమీషన్ మర్చంట్సు, పాలకొల్లు.

39 శ్రీ కొండాడ వెంకటరాజు గుప్తగారు, క్లాత్ మర్చంట్సు.
40 రాజులపాటి వెంకటేశ్వర్లుగారు.
41 అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు, M. L. A.,
42 కలగ వెంకట సూర్యసత్య శంభుప్రసాద్‌గారు.
43 బుర్రెడ్డి తమ్మేశ్వరరావుగారు, పోస్టు మాస్టరు.
44 దశిక రామారావుగారు, B. D., ఎక్స్టెన్షన్ సూపర్వైజర్, కొవ్వూరు.
45 నిట్ట భీమశంకరంగారు, రిటైర్డు ఇన్‌కంటాక్సు ఆఫీసరు, రాజమండ్రి.
46 చిన్ని తరుణయ్యగారు, B. E., (మెకానికల్) ఇంజనీరింగు కాలేజి, కాకినాడ.
47 కాళ్ళకూరి సూర్యనారాయణగారు, అగ్నిపురము విశాఖపట్టణము.
48 కురుకూరి సన్యాసిశెట్టిగారు, జనరల్ మర్చంట్సు.
49 బొండపూడి వీరరాజుగారు, M. B. B. S.,
50 పలుకూరి జగన్నాధరావు గారు.
51 దేవులపల్లి కృష్ణమూర్తిగారు బి. ఇ (ఎలక్ట్రికల్) ఆంధ్రాయూనివర్సిటీ.
52 ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, కమీషన్ మర్చంట్, అనకాపల్లి.
53 కలిగొట్ల సూర్యనారాయణగారు, ము॥ చైర్మన్, భీమునిపట్టణము.
54 దుర్గా దానయ్యశెట్టిగారు, & సన్, మర్చంట్సు.
55 ఏడిద సూర్యనారాయణమూర్తిగారు.
56 రాయపురెడ్డి అప్పారావునాయుడుగారు, వైస్‌చైర్మన్.
57 పొట్లా వీరరాజుగారు. రు 116
58 సుదురుపాటి వీరరాజు గారు, శిర్లపాలెం.
59 కారణ గ్రంథాలయము. రు 116
60 పోలిశెట్టి వెంకటరమణయ్యగారు, (రాజా) కమీషన్ మర్చంట్సు, విజయనగరము. రు 116
61 మాటూరి లింగమూర్తిగారు, క్లాత్ మర్చంట్సు.
62 మేఘాద్రి మహాలక్ష్మమ్మగారు, గజపతినగరము. రు 116

63 శ్రీ ఆడక్కి వేం. కృ. హనుమంతరావుగారు, శ్రీకాకుళము.
64 భూసపాటి రామచంద్రరాజుగారు, B. E., ఎగ్జక్యూటివ్ ఇంజనీయరు.
65 కొత్తా రమణాజీరావుగారు, కమీషన్ మర్చంట్సు, బొబ్బిలి.
66 నంగునూరు మహబూబురెడ్డిగారు, దేశిముఖ్, వరంగల్లు.
67 గైనేడి వెంకట అప్పారావుగారు, L. M. P., హైదరాబాదు.
68 వీరమనేని గోపాలరావుగారు, డిప్యూటీ డైరెక్టరు సివిలుసప్లయిస్.
69 వి. యస్. వారణాసిగారు, రిటైర్డు అసిస్టెంటు స్టేట్ కమీషనరు.
70 యస్. వేణుగోపాల్‌గారు, రిపోర్టరు, లెజిస్లేచరు శెక్రటరేటు.
71 కనకదండి భాస్కరరావుగారు, B. Sc., ఇన్‌కంటాక్సు ఇన్‌స్పెక్టరు, హైదరాబాదు.
72 మహమ్మదు రహింతుల్లాగారు, M. L. A., ము॥ చైర్మన్, కడప.
73 రామకృష్ణ సమాజ గ్రంథాలయము.
74 రాపూరు రంగనాథంగారు, అడ్వోకేటు.
75 పోలేపల్లె వెంకన్న శ్రేష్ఠిగారు, నల్లూరు.
76 ముత్యాల లక్ష్మయ్యశెట్టి & సన్స్, కమీషన్ జనరల్ మర్చంట్సు, తిమ్మనచర్ల.
77 జూటూరు దాసప్ప & సన్సు, జనరల్ మర్చంట్సు.
78 యస్. నాగప్పగారు, స్కిన్ మర్చంట్సు.
79 యస్. కొమరప్ప & సన్స్ బ్యాంకర్సు, బళ్ళారి.
80 కె. లక్ష్మీపతి & సన్, కమీషన్ మర్చంట్సు.
81 కె. సన్న ఓంకారప్పగారు, మర్చంట్సు.
82 వి. వేంకటరత్నం నాయుడుగారు, L. M. P.,
83 జయంతి రుద్రయ్యశెట్టిగారు. బ్యాంకర్సు. రాయదుర్గము.
84 చిందనూరు నాగప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు.
85 తల్లం హనుమంతప్పశెట్టిగారు, కమీషన్ మర్చంట్సు.
86 టి. రాజశేఖర రెడ్డిగారు, అలంపురము.

87 రావుబహదూర్ టి. ఆర్. రామచంద్రశాస్త్రి గారు,
అడ్వొకేట్, కర్నూలు
గీతా సేవాసమితి, కళ్యాణదుర్గము.

88 శ్రీ మలుగూరు సంజీవప్పగారు, కనగానపల్లి.

89 ఎ. యం. ఓబలాపతి శ్రేష్ఠిగారు,
B. com., B. L., F. S. A. A., ఇన్కంటాక్సు
ప్రాక్టీషనరు, అడ్వొకేటు, మద్రాసు.

## పోషకులు

## రు. 50/-

1 శ్రీ ఎలిశెట్టి సుబ్బారాయుడుగారు, గోల్డు మర్చంట్సు, నెల్లూరు. రు 58

2 కట్టె సత్యనారాయణగుప్తగారు, విద్వాన్ విజయవాడ.

3 పసుమర్తి సుబ్బరాజుగారు, G. D. A., F. C. A.,
అసిస్టెంటు మానేజరు, ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఆఫ్
ఇండియా, బొంబాయి.

4 తుమ్మల వేంకటేశ్వరరావుగారు, భీమడోలు.

5 కొండ ఈశ్వరరాజుగారు, గుండుగొలను.

6 ఉనికిలి వేంకటరాజుగారు.

7 నడురుపాటి సత్యనారాయణగారు, భీమునిపట్టణము. రు 58

8 పూసర్ల అప్పలనరసయ్యగారు, టింబరుమర్చంట్సు
విజయనగరము. రు 58

9 వెలగపూడి సుందరరామ దత్తుగారు, నెల్లూరు.

10 తాయి మల్లిఖార్జునప్ప శెట్టిగారు, మర్చంట్సు, రాయదుర్గము.

—(o)—

# ప్రస్తావనము

శ్రీ వివేకానంద యతిసార్వభౌమునిగూర్చి ఆతని జీవిత విశేషముల జిత్రించు గ్రంథములు ఆంధ్రమున ననేకములుకలవు. కాని ఆసన్న్యాసరాజువలె జిన్నతనాన వైరాగ్యమబ్బి, అతని వలె సునిశితవివేకమున దాని విమర్శించి, దాని బలాబలముల బరీక్షించుకొని, ముందు వెనకల కుశాగ్రబుద్ధి నవలోకించి మనోదార్ఢ్యమును హృదయనిర్మలత్వముల నార్జించి, ధైర్యోత్సాహముల బ్రపంచజీవితమున బ్రవేశింపక బూర్వమే దాని దూరమొనరించి పారమార్థికజీవితమున తన పదునాల్గవయేటనే లంఘించిన మన మాతాజీ త్యాగీశానందులు వ్రాయుట విశేష మనిపించును. వివేకానందుని విరాగముయొక్క విలువ యిట్టి విరాగులకు అవగతము. సన్న్యాసపూర్వమున విరాగుల నెదుర్కొను ప్రచండాఘాతముల క్రౌర్యమును, వాని వమ్ముగావింప గల తమ Purity Perseverence and Patience పవిత్రత, పట్టుదల, ఓర్పులనుగలిగి వానికిమించు ఆర్తితో నవకాశమునకై వ్యతిరేకశక్తుల శాంతమున నెదుర్కొని జయముగాంచుట యందుగల కష్టనిష్ఠురములను, ఆనందమును అందరు గ్రహింపజాలరు. 'విశ్వసించిన సత్యమునకై వెన్నుచూపక నిలచిపోరుము వెరపు చెందరు ప్రాణములకై పీకులంచును తెలియజాటుము' అని గదా విరాగయోధుల గంభీరవాణి! కాన నట్టిస్థితుల ననుభవించిన వ్యక్తులు ఆ విషయముల నభివ్యక్తము గావించుట విశేషముకాక మరేమి?

మరియు, వివేకానందుని అడుగుజాడల ద్రొక్కుచు, బరిమితముగ నైన దేశమున బర్యటించుచు, భారతీయ పారమార్థిక సంస్కృతీ వైభవములను మృదుమధురమును గభీర గంభీరమును అగు ఉపన్యాసముల బ్రచారముగావించు మన మాతాజీ మన వివేకానందుని ప్రచారవైశిష్ట్యమును గ్రహించి వచింపగల్గునుగదా!

అందుచే 'మన శారదామాయి' ప్రచురణము కావుట తోడ నామెకు విద్యాదర్శముగా హృదయము నావేశించియున్న శ్రీ వివేకానందుని గూర్చియు మననముగావించి, 1953 జనవరిలో నీ 'మన వివేకానందుడు' అనుపాత్తమును చిన్నదిగ వ్రాసికొని యుండెను. అదియు నుచితశైలిలో రచింపబడి యుండుట గమనించి, సంతసించి, శ్రీ శారదా శతవార్షిక జయంతి సందర్భమున బ్రకటించి యుంటిమి.

ఈ గ్రంథముగూడ తెలుగునాట బ్రాశస్త్యము నార్జించి, ఎల్లర హస్తముల నలంకరించి, సర్వసంస్తుతుల కాలవాలమై ద్వితీయ ముద్రణమును జేరుకొనినది.

సంకల్పము నిర్విఘ్నముగ గొనసాగుట ఎంత ఆనంద దాయకము! 'మన వివేకానందుడు' సర్వత్ర వ్యాపించి, పరిణమించి, ద్వితీయ ముద్రణమున నభివృద్ధిని సాధించి, అందచందములతో, ద్విగుణీకృత స్వరూపముతో ఆంధ్రావనిలో బునః ప్రవేశ మొనర్చుట కెవరు ఆనందింపరు! ఎవరి హృదయములు ఆహ్లాదింపవు!

అతుల వినూత్న వైభవములతో 'మన వివేకానందుడు' విరివిగ దేశమున బరివ్రజించి, సర్వహృదయముల జొచ్చి, తన ఉన్నత గభీర వైరాగ్య ఉత్కృష్ట బీజముల నా యా హృదయ క్షేత్రముల నాటి, వివేక వృక్షమును బెంచి, జ్ఞానఫలముల బండించి, విరివిగ బంచి, అంతట దానైయై విరాజిల్లి, పారమార్థిక జీవితాదర్శ మాధుర్య చంద్రికల బ్రకాశించుగాక!

అద్దానికై భగవాన్ శ్రీ రామకృష్ణదేవుడు సర్వదా సర్వథా తన కృపాదృష్టి దోడ్పడునుగాక !

ఓం

శ్రీ సన్న్యాసరాజాయ నమః

# మన వివేకానందుడు

## విజ్ఞాన స్వరూపము

మం॥ వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థా
స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధ సత్త్వాః।
తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే
పరామృతా త్పరిముచ్యంతి సర్వే॥

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులైన యతివరేణ్యులు సన్న్యాస యోగమువలన శుద్ధసత్త్వముగలవా రగుదురు. మరియు నీ సమస్త యతిపుంగవశ్రేణి యంత్యకాలమున బ్రహ్మలోకమును బొంది అమృతత్వము నాబరగు మోక్ష సామ్రాజ్యము నధిష్ఠించుచుందురు అని కైవల్యోపనిష ద్వాక్యము.

ఈ శ్లోకార్థము ననుసరించి 'వేదాంత' మన నేమి? 'విజ్ఞాన' మన నేమి? 'సన్న్యాస' మనగా నేమి? త్యాగసమ్రాట్టు లనదగు సన్న్యాసు లెవరు? ప్రాచీన ఆధునిక విజ్ఞానముల విభేద మెట్టిది? పూర్వ విజ్ఞానవైభవమును బునః సంపాదింప నేటి కర్తవ్యమేమి? యను విషయముల నిసుమంత జాగరూకత తో యోచించెదముగాక!

'విజ్ఞాన' మను పదమున కర్థమేమి? విజ్ఞానము విద్యయా ? కాదు. అయిన విజ్ఞానార్థమేమి ? విజ్ఞానము సంఘ శ్రేయస్కామిదై వెలుగొందుచు, వికసిత పుష్పము నాశ్రయించియున్న స్వభావసిద్ధ సుగంధమువలె, నాగరికతకు ప్రాభవ మొసంగును. అది వ్యక్తి నాశ్రయించి, సంఘమున నాగరికతా రూపమును బొందియుండును. కాన విజ్ఞానములేని నాగరికతయే యభావమగును. అంతియగాక ఈవిజ్ఞానమునకు కేవలము శాస్త్రజన్య జ్ఞానము మాత్రమేగాక, అనుష్ఠాన వేదాంత మాధారమై యెప్పుడు యొప్పునో, అప్పుడే యది పరిమళ కుసుమ ఫలశోభితమగు తరువుమాడ్కి ఫలప్రదమై తనరారును. అందుచే విజ్ఞానమునకు వేదాంత మూతగ్రమై పట్టుగొమ్మయై, యుండవలెను. అదియే విజ్ఞానముయొక్క యథార్థతత్త్వము. అదియే విజ్ఞానముయొక్క సహజ స్వరూపము. అదియే విజ్ఞానవాహినియొక్క యుత్కృష్టత. అట్టి యుత్తమ విజ్ఞానజనిత కాంతిపుంజములే దేదీప్యమానమై ప్రజ్వరిల్లుచు, భయానక రూపమును దాల్చు సర్వప్రపంచమునకు శాంతిని బ్రసాదించును. అందుచే నట్టి వేదాంత విజ్ఞాననమున కాకరమైన యతివరేణ్యులే శాంతిప్రదాత లగుదురు కాని యన్యుల కసాధ్యము. అట్టి శాంతిసంధాయకమైన విజానమునేకదా 'విజ్ఞాన మానందం బ్రహ్మ' 'ప్రజ్ఞానం బ్రహ్మ' యని యుపనిషత్తులును నుతించి యున్నవి!

ప్రపంచాధారమగు విజ్ఞానమునకు అధిష్ఠానమైన 'వేదాంతము' అను పదము 'విత్' అను ధాతు జన్యము. 'విత్' అనగ తెలివి యనియు జ్ఞానమనియు నర్థము. కాన

వేదాంతమున 'విత్' అను ధాతుజన్యమైన ప్రజ్ఞారూపమగు వేదార్థమే యనియు నర్థము స్పష్టము. అనగా జీవ బ్రహ్మ సంబంధమును బోధించుచు, జీవుడు బ్రహ్మాంశమనియు, బ్రహ్మమే యనియు నుపదేశించుచు, సర్వజీవ సమత్వమును, ఏకత్వమును వ్యక్తము చేయునదియే వేదాంతమని తాత్పర్యము. అందుచే, నట్టి వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులే ముని శ్రేష్ఠులే సంఘ శ్రేయస్కాములై, బ్రహ్మైక్యానుసంధానులై బ్రహ్మానంద విలోలురై ప్రపంచమున మనగలరు. వారిపైన మాత్రమే సంఘ భావి భాగ్యోదయ మాధారమై యుండును.

వేదాంత విజ్ఞానసంపన్నులు సన్న్యాసయోగాధిష్ఠానులగు యతులనియు పై శ్లోక నిశ్చయము. సన్న్యాస మనుటతోడ గొందరికి భయమును, గొందరికి వ్యత్యస్త భావములు కలుగుట సాధారణము. కాని సన్న్యాసమనగా, సమ్యక్ + న్యాసము అనియు, సత్ + న్యాసము అనియు నర్థములు గోచరము. జగద్రూపమునందు జీవసముదాయము, అనగా సంఘముతోడను, 'సా కాష్ఠా సా పరాగతిః' అను శ్రుతి చందము ఉత్తమమును, బరమును జగదాధారమును అగు బ్రహ్మముతోడను ఉత్తమ సంయోగము గలిగి యుండుటయే యని యర్థము, అంతరార్థము. బాహ్యమునగల పరాగాత్మ అంతరమునగల ప్రత్యగాత్మల ఏకస్వరూపమే గదా బ్రహ్మము! ఆ రెండింటితో ననన్య సంబంధమున మనుటయే సన్న్యాసము. అట్టి సద్యోగమును గలవారలే సన్న్యాసులు. అందుచేత, ప్రాచీన విజ్ఞానమున, ఆర్ష సంప్రదాయమున,

సన్న్యాసము ఆశ్రమ చతుష్టయ శిరోభూషణమై 'గృహా శ్రమో జఘనతః బ్రహ్మచర్యం హృదో మమ। వక్ష స్థలాత్ వనేవాసః సన్న్యాసః శిరసి స్థితః॥' గృహస్థ బ్రహ్మ చర్య వానప్రస్థములకు సన్న్యాసము శిరస్సునందున్నదని శ్రీమద్భాగవత పురాణముచేగూడ నీ సన్న్యాసము స్తుతింప బడుచున్నది. అసంఖ్యాకములగు ఉపనిషత్తులును బురాణేతి హాసములును సన్న్యాసమును బలుతెరంగుల వివరించి, నుతించియున్నవి.

సన్న్యాసావలంబన విధానమున 'బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహాద్వనీ భూత్వా ప్రవ్రజేత్' మొదలగు మంత్రరాజములు ఆశ్రమ క్రమమున సన్న్యాస మును విధించుచున్నవి. కాని 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాద్వా వనాద్వా' బ్రహ్మచర్యమునుండియే సన్న్యసింప వలెను, లేక గృహస్థాశ్రమమునుండి గాని, వానప్రస్థము నుండిగాని యనియు, 'యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్' ఎప్పుడు విరాగము జనించునో తత్క్షణమే సన్న్యసింపవలయును అని యనేక శ్రుతివాక్యము లుద్ఘో షించుచున్నవి. మరియు 'యదా మనసి వైరాగ్యం జాయతే సర్వవస్తుషు। తదైవ సన్న్యసే ద్విద్వాన్......' సర్వవస్తు సముదాయమునందు ఎప్పుడు విరక్తి జనిం చునో వెంటనే విద్వాంసుడు సన్న్యాసమును స్వీక రించును అని సౌరపురాణముగూడ వాకొనుచున్నది. ఈ వాక్య సంతతి ఆశ్రమక్రమమునుగాక, వైరాగ్య ప్రాధాన్య మును సూచించుచు, ఉత్తమ సన్న్యాసులు 'బ్రహ్మచర్యా

దేవ...' బ్రహ్మచర్యమునుండియే సన్న్యాస గ్రహణము గావింతురని నిర్ణయించియున్నది. అట్టివానియందు పవిత్రత మూర్తీభవించియుండును. వాడే గురోత్తముడు. వానికి భగవత్సాక్షాత్కారము కరతలామలకము. బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠత్వమే సన్న్యాసాధికృతను అధిగమింపజేసి పూర్ణత్వము నొసంగును.

సన్న్యాస స్వీకరణమునకు శాస్త్రము కొందరిని అనర్హులుగా నిర్ణయించియున్నది. షండులు, పతితులు, వికలాంగులు, స్త్రీలోలురు, బధిరులు, అర్భకులు, మూక పాషండాదులు అనధికారులు. అందు లింగభేదము అగోచరము అసంగతము. అందుచేతనే ఋగ్వేదమంత్రకర్త్రి ఘోష నాబడు వనితామణియు, న్యాయశాస్త్ర ప్రవీణయగు సుబాలయు, బ్రహ్మచారిణియై తీవ్ర తపమొనరించి ఆధ్యాత్మికానుభవానందమును గ్రోలి, యోగదర్శన కర్తయగు పతంజలి మహర్షిని దయారొనర్చిన తపస్విని గోణికయు, వేదాంత విదుషీమణియగు గార్గియు, ఆత్మవిభూతి నిమగ్నయై పర్యటించు సులభయు, తంత్రశాస్త్రకోవిదయై తపోధనయై వెలుగొంది, శ్రీ రామకృష్ణదేవునకు గురువై చెలువొందిన భైరవీ బ్రాహ్మణియు, బాల్యముననే గృహమును త్యజించి, శ్రీ శారదామాయి శిష్యురాలై, ఆదర్శయై యొప్పు గౌరీమాయియు మొదలగు ప్రశస్త సన్న్యాసినులు ప్రస్ఫుటము. కాన సన్న్యాసమున స్త్రీ పురుష విభేదము లేదని విదితము. ఆకారణమున శ్రీరామకృష్ణదేవుని సాన్నిధ్యమున నుండి, సర్వ జాతి మత లింగ భేదాతీత స్థితిని జరించియున్న శ్రీ వివేకానందుడు సర్వమత సమ్మేళనమున బాల్గొన

అమెరికా దేశమున కేగి నప్పుడు, Mme Marie Louise మాడమ్ మేరీ లూయిూ అను పాశ్చాత్య వనితామణికి సన్న్యాసము నొసంగి ఆమెకు అభయానంద యను నామము నిడెను. సర్వ సమత్వమును బోధించి అనుష్ఠించు వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులైన సన్న్యాసయోగుల హక్కుగదా సర్వసమత్వము!

అందుచేత యుపనిషత్కాలమునగల 'సంవర్త, కారుణి శ్వేతకేతు దుర్వాస ఋభు నిదాఘు జడభరత దత్తాత్రేయ రైవత' కాది యతివరేణ్యులును, చరిత్ర యుగమునగల త్యాగ ప్రేమముల కాటపట్టగు గౌతమబుద్ధుడును, సకల శాస్త్ర పాండిత్య ప్రకర్ష చే నుద్గ్రంథముల విరచించి స్వీయమేధాశక్తిని ప్రకటించిన శంకరాచార్యులును, విశిష్టాద్వైత ప్రతిపాదకుడైన రామానుజాచార్యులు, ద్వైత సిద్ధాంత ప్రబోధకుడగు మధ్వాచార్యులును, ఆధునిక కాలమున, సర్వమత సామరస్యమును సర్వానుభవ స్వరూపమును గల్గియుండిన శ్రీ రామకృష్ణ పరమహంస దేవుడును, రాజాధిరాజులకైన సాటిలేని రాజర్షివిగల్గి, వేదాంత సుధను ప్రాక్ప్రతీచీ దేశముల దన అమృత వాగ్ఝరిచే వెదజల్లి, ప్రాచీనాధునిక విజ్ఞానమును సమన్వయ పరచిన శ్రీవివేకానందస్వామియు, రెండవ వివేకానందునివలె నమెరికా ఖండమున భారతీయ విజ్ఞాన ప్రచారమొనరింప తీర్థరామ నామమును రామతీర్థులుగా మార్చి ప్రఖ్యాతి గాంచియున్న రామతీర్థ స్వామియు, నాటినుండి నేటివరకు భారతీయ విజ్ఞాన సౌధమునకు ఆధారభూతులై, భారత విజ్ఞాన స్వరూపులై వెలుగొందిన మన కెల్లర కారాధ్యులై ప్రకాశించి రనుటయందు దావంతయు నాశ్చర్యములేదు. అట్లు వేదాంత విజ్ఞానార్ణవమున నీదులాడు

వారి భావమాధురిని పఠించి, వారి మనో దార్ఢ్యమును గ్రహించి, సర్వసమత్వమును దలంచి, యవలంబించి, ఆనందించుటే భారతజాతి కర్తవ్యము. అదియే భారతీయ ప్రజ్ఞాధిక్యత! భారతదేశము పుణ్యపురుషులకును, మహాను భావులకును, అవతార వరిష్ఠులకును, భగవన్మూర్తులకును, బుట్టినిల్లుగదా!

## వి వే కా నం ద స్వా మి

కావున అట్టి మహాపురుష శ్రేణిలో, యతిరాజ పంక్తిలో ప్రముఖుడై, బుద్ధదేవుని త్యాగనియతి ప్రేమవాహి నియు, శంకరుని ప్రజ్ఞాకౌశలమును గల్గి, బహుభాషా ప్రావీణ్య ముున వలరారి, అవతారవరేణ్యుడును కామకాంచన విజ యుడును, పరమహంసావతంసుడును, అనుభవదేవుడును నగు శ్రీరామకృష్ణుని గురువరేణ్యునిగ స్వీకరించి, పూజించి, యనుస రించి, అయ్యనుభవసుధ నాస్వాదించి, ఆయనుభవసంపదను దానొక్కడే స్వార్థమున గ్రోల నిచ్ఛగింపక, సర్వప్రపంచము నకు శ్రీరామకృష్ణ సందేశామృతమును విరివిగా బంచియిడు దృఢసంకల్పమున గృతనిశ్చయుడై, ప్రపంచమునకు వినూత్న సందేశము నొసంగువాడై, తా నేదేశమునకు జెందియున్నను, భావసముదాయము సర్వమానవోపయుక్తముగాన, శ్రీరామ కృష్ణ పరమహంసదేవుని సాధన సందేశసారమును గేవలమొక భారతదేశమునకే గాక, స్వార్థుడై తను ఆయురారోగ్యముల మాత్రము ప్రధానముగ దలంచుచు, అజ్ఞానాంధకారమున

ద్రమ్మగుచు, సంసారార్ణవ నిమగ్నులగు పాశ్చాత్యుల కండ్ల దెర చుటకై యమెరికా యూరపు ఖండములగూడ ఆదివ్యవాణిని గొంపోయి, తన విజ్ఞాన దీప్తిపుంజముచే వారి అజ్ఞానాంధ మును రూపుమాపి, ఆరిపోవుచున్న భారతీయ విజ్ఞాన దీపికను తన వాక్పటుత్వముచేతను, సమయోచిత ధీకుశలత చేతను, ప్రాక్పశ్చిమ విజ్ఞాన సమన్వయ శక్తిచేతను, సర్వమత సామ రస్యరూపమగు వేదాంత ప్రబోధముచేతను అఖండజ్యోతిగ నొనరించి, ఆత్మశాంతికాములు భారత ఋషిపుంగవులనే యాశ్రయింప వలయునని సకల ప్రపంచమునకు ఎలుగెత్తి చాటి, అసంఖ్యాక పాశ్చాత్యుల శిష్యులుగ స్వీకరించి, భారత విజ్ఞాన ధ్వజమును ప్రతిష్ఠించి, యశశ్శ్రీ నార్జించి, భారతమును గురు పీఠమున బునః ప్రతిష్ఠితము గావించి మన కెల్లర కాదర్శ ప్రాయుడై వెలుగొందిన మన వివేకానందునకు దలయొగ్గని మానవు లీనాడెవ్వరు ? ఈ సన్న్యాసరాజ జీవిత విశిష్టతను, కార్యదక్షతను, ఉపన్యాస విధానమును, అద్భుత ప్రతిభా విశేషముల గ్రహింప యత్నించెదముగాక !

## వంశము - జననము

సర్వప్రపంచమును తన దివ్య వాక్సుధా సాగరమున విలీన మొనరించి, అమృత తుషారములబోలు వచనములచే బ్రతీచీ పండిత హృదయముల రంజింపజేసి, అందు భారతమూర్తి మత్వమును బ్రతిష్ఠించి, అఖండ వేదాంత డిండిమమును మ్రోగించి, సర్వదేశాధినాథుల యాహ్వానముల రాజనగరుల

వసించియు దీనులగూర్చి పరితప్త హృదయుడై, ప్రేమసాగరుడై, విశ్వమానవ సౌభ్రాతృత్వమును ప్రదర్శించిన వివేకానందుని గని, జగద్ధితముగోరి త్యాగమొనర్చిన నామాతాపితల నామము లాచంద్రార్కము్లై ప్రకాశించునుగదా! ఆ విశ్వమానవ ప్రేమ, ఆ ధైర్యస్థైర్యములు, ఆ కుశాగ్రబుద్ధి, ఆ సర్వసమత్వము, ఆ త్యాగనిరతి, ఆ కార్యశూరత్వము, ఆభక్తి, ఆ జ్ఞానములు మన వివేకానందుని కెటనుండి లభ్యము? జననీ జనకుల నుండియేగదా! అంతియగాక వంశ పారంపర్యముగగూడ నది సంప్రాప్తము అని వచింప వలయును. ఎట్లన? ఒక్కపర్యాయము వెనుదిరిగి వంశమును దిలకించినచో నది గ్రాహ్యము. అమృత భావయగు సంస్కృతమునందును బారశీకమునందును అసమాన ప్రతిభ గడించి, న్యాయశాస్త్ర ప్రవీణుడై, న్యాయవాదియై యుండియు, సర్వప్రాపంచిక సౌఖ్యములకు నెలవైయొప్పు తన గృహమును ద్యజించి, పరమేశ్వరు బొంద నిచ్ఛగించి, 'న సన్న్యాసాత్ పరోధర్మో వర్తతే ముక్తికారణం' సన్న్యాసము కంటె ముక్తికారణమగు ధర్మము వేరొండు లేదను బృహద్ధర్మ పురాణ వాక్యమురీతి, దీవ్ర వైరాగ్యయుక్తుడై, తన యిరువది యైదవ యేటనే, సౌందర్యవతియగు భార్యను, ముద్దులొల్కు నేకైక పుత్రుని వీడి సన్న్యాసమును స్వీకరించిన దుర్గాచరణ దత్తు డీతని పితామహుడు! అగుటచే నాత్యాగవాహిని యీ వంశాంతర్గతమై ప్రసవించుచు, మన వివేకానందుని త్యాగ స్వరూపునిగ నొనర్చిన దనుటయం దాశ్చర్య మిసుమంతయు లేదు.

మరియు దుర్గాచరణుని అపారపాండిత్యము త్యాగము, మూ_ర్తీభవించి ద_త్తవంశమున సార్థకనామధేయుడై, సుపుత్రుడుగా జన్మించిన విశ్వనాథదత్తు వివేకమున కధినాథుడైన వివేకానందుని తండ్రి. ఇతడును ఆంగ్ల పారశీకములందు మేటి పాండిత్యమును గడించి, న్యాయవాదవృ_త్తి నవలంబించి, ఆవృ_త్తికలంకారతుల్యుడై వృద్ధినొందెను. కేవలము ఉద్యోగము చేతనేగాక, దానశీలుడై, ధర్మనిరతుడై, దయార్ద్ర హృదయుడైయుండు నీతడు సర్వసంపదలచే దులదూగుచు భారతావనిగల పెద్ద నగరములలో బేరెన్నికగని, పూర్వము కాళీఘట్టమనియు, నేడు కలక_త్తయనియు, నామమున జెల్లు మహానగరవాసియై యుండెను. మరియు నీ విశ్వనాథునిచేతనే ద_త్తవంశము ప్రభువంశమని ప్రతీతిగాంచెను. విశ్వనాథునకు దగిన సహధర్మచారిణియై, పేరుకుదగిన ప్రేమమూ_ర్తియై చెల్వొందినది భువనేశ్వరీమాత. భ_క్తిప్రపూర్ణయై ప్రతిదినమును ఆమె శివపూజ గావించుచు, పుత్రప్రా_ప్తికై ప్రార్థించెడిది. ఆమె ప్రార్థన నాలకించిన భ_క్తవశంకరుడైన కైలాసాధినాథుడు ఆమెకు స్వప్నమున పుత్రస్వరూపమున నావిర్భవించినట్లు గోచరించి యనుగ్రహించెను. ఈ యనుభవానంతరమే మన వివేకానందుని జననము! అందుచేత, 'నరేన్, చూడుము, నీ యందు శివుడంతర్గతము, నాలో శ_క్తి యంతరము. ఈ రెండును ఏకమే సుమా!' అనియు, 'ఎవ్వరైన నాతని దూషించిన శివనిందా పాపమున దగుల్కొందు' రనియు శ్రీ రామకృష్ణ దేవుడు నరేంద్రునిగూర్చి వచించెడివాడు. ఎవ్వరేని తినుబండారముల దెచ్చి యిచ్చినచో నందు, స్వభావశుద్ధిగల వారి పదార్థముల

నితర శిష్యుల కొసంగుచు, గ్రామ్యబుద్ధిగలవారి వస్తువుల నరేం ద్రునకు నిచ్చుచు 'నరేంద్రు డేది భుజించినను భయములేదు. అతడు దివ్యస్వరూపుడు' అని పై సంఘటనముల గ్రహించియే రామకృష్ణుడు వచించియుండ నోపును. మహాత్ముల చర్యలు అగ్రాహ్యములు గదా!

అంత 1863 వ సంవత్సరమున జనవరి పండ్రెండవ తేదీన అనగ దుందుభి నామసంవత్సర పుష్య బహుళ సప్తమి సోమ వారము ప్రాతఃకాలమున, దేశమెల్లెడల మానవులానందముగ సంక్రాంతి సంబరమున మునిగియుండ, సర్వప్రపంచమున నజ్ఞ మానవుల యార్తనాదములు చెవుల సోక వారి సముద్ధరణము నకై యరుదెంచెనో యనునట్లు భువనేశ్వరీ గర్భవాసమున గాలాంతరమున వివేకానంద నామమున బ్రపంచ ప్రఖ్యాతుడగు నరేంద్రనాధు డుద్భవించెను. వెంటనే భువనేశ్వరియు నాబాలుని దేవత్వమును గ్రహింపజాలకున్నను, సన్న్యాస చక్రవర్తియై, కీర్తి దిగంతముల బ్రసరించినప్పుడైనను తన పుత్రుని గొప్ప దనమును గ్రహించి మహదానందమున నోలలాడిన ఆ తల్లి నిజముగా భువనేశ్వరియై గర్వించుట మహాభాగ్యము. అవును, సాధారణముగ నొక యల్ప యుద్యోగమునుండి పెద్ద పదవికి వెడలిన బిడ్డను జూచియే జనకులు సంతసింతురే, యిక సకల ప్రపంచమును దన ఝంఝామారుతరూప వాక్ప్రవాహముచే భారతదేశమునేగాక, సర్వదేశముల బండిత హృదయముల జొచ్చి కలచి, అపూర్వ సంస్కరణము గావించిన పుత్రుని, వివేకానందుని జూచి ఆ తల్లి యుల్ల మెంత యుప్పొంగినదో మన కేమెరుక? నాడు మనము ఆతల్లితో నానందింపకున్నను,

ఆయతివరేణ్యుని యుపదేశ విధానములలో నేయొక్కదానినైన గ్రహించి, సాధించి, ఆనందింపనగునుగదా! అతడు దుందుభి నామ వత్సరమున జనించుటచే అఖిలప్రపంచమున దిక్కులు పిక్కటిల్ల వేదాంతసింహమువోలె గర్జించి, 'మోక్షార్థం బ్రహ్మ విజ్ఞాన మితి వేదాంత డిండిమః' మోక్షముకొరకు బ్రహ్మ విజ్ఞానమను వేదాంత డిండిమము నా శంకరాచార్య సూక్తిరీతి వేదాంత దుందుభిని మ్రోగించియుండనోపు! అట్లు ఉద్భవించిన నాబిడ్డడికి నరేంద్రనాథుడనియు, నీలకంఠ వరప్రసాద లబ్ధుడగుటచే వీరేశ్వరుడనియు నామకరణమును జనకులు గావించిరి.

## బాల్యము - తల్లిదండ్రులు

ఇట్టి యసమాన శేముషీదురంధరులగు మత ప్రబోధకుల యొక్కయు, జ్ఞానశీలుర యొక్కయు, భావజాలములు బాల్యమునుండియే వైజ్ఞానికాంతరిక్షమున తారానాథునివలె ప్రకాశించుచుండును గదా! అస్మదాదుల కెన్ని వత్సరములు ప్రాప్తించినను మానవజీవిత పరమావధిని గుర్తెరుంగజాలము! కాని వారు పసితనముననే ప్రపంచమున నేమియో, ప్రపంచము నుండి ముక్తిగాంచుటెట్టులో, ప్రపంచమున దమ గార్యాచరణ విధాన మెద్దియో, మున్నగు విషయముల నామూలాగ్రముగ నవగాహన మొనర్చుకొని తదనుగుణముగ మెలగుదురు. చూచితిరా, సాధారణ మానవులకును, అయసామాన్య ప్రజ్ఞాధురీణులగు మహాత్ములకునుగల వ్యత్యాసము! వారు జనించిన దాది ఏస్వల్పకార్యము నొనరించినను, ఆకార్యము వారి భావి

భాగ్యోదయ సంస్థితులనే సూచించును. వారి సంస్కారపుంజము బాల్యమునుండియే మొలకలెత్తి వసంతవృక్షము చిగిర్చి, పుష్పించి, ఫలించినట్లు కాలాంతరమున వారి జీవిత వృక్షము విజ్ఞాన పుష్ప ఫలభరితమై సర్వానందదాయకమై తనరును. అట్లే నరేంద్రుని బాల్య సంస్కారము లెవ్విధమున నభివృద్ధి గాంచి, వికసించెనో గ్రహించెదముగాక!

పసితన మాదిగ నరేంద్రనాథుని హృదయకుహరాంత ర్గతమై త్యాగము చిన్న పిల్లకాలువవలె బ్రవహించుట గాన నగును. అంతియగాక, భారతీయాధ్యాత్మిక మాహాత్మ్యమును వ్యక్తపరచుటకును, వేదాంతామృతమును గ్రోలి అందలి రహస్యముల దేశముల నుపదేశించుటకును, సన్న్యాసియే యధికారి యగుటచే, నట్టి సన్న్యాసమును గ్రహించి ఆధ్యాత్మిక రాజేంద్రుడై సర్వప్రపంచమును ఉర్రూతలూగింపగల లక్షణ ములు పైకుబుక నెచ్చటే సన్న్యాసి గోచరించినను వారి దృష్టిపరచి యానందించెడివాడు. 'తేన త్యక్తేన భుంజీథా' త్యజించి ఆనందింపుము, అను ఈశావాస్యోపనిషత్తుయొక్క త్యాగ మాధుర్యమును నాడే ఆ పసిబాలుని హృదయ మాస్వా దించి ఆనందించుచుండెనేమో!

మరియు దన స్నేహితుల వంశమున నెవరేని సన్న్యా సులు గలరని యాలకించిన వారి నితరులకంటె నధికముగ బ్రేమించుచుండెడివాడు. ఒకొక్క సమయమున తాను సన్న్యాసి నగుదుననియు, అట్లు సన్న్యాసమును గొని దేశ పర్యటనము సాగింపగల ననియు, అనేక ఘనకార్యముల నొన రింపగలననియు, హృదయముప్పొంగ యత్యాశ్రమ స్వీకరణమే

తన దృఢ నిశ్చయమని దీక్ష వహించినట్లుగ నరేంద్రనాథుడు పసితనమున తన మిత్రబృందముతో బల్కొడివాడు. అంతియు గాక అవకాశము లభించు సమయముల సన్న్యాస విషయముల ముచ్చటించుచు, వారి త్యాగనియమ నభినందించుచు, నన్నింటి కంటె సన్న్యాసమునే అధికముగ ప్రశంసించుచుండెడివాడు. ఆ బాలు రది విని సామాన్యసాధు జీవిత విధానముల గాంచి నవా రగుటచే నా జీవితము సేవగించి పరిహాసము సేయ, 'యథార్థ మహిమాన్వితులగు సాధుపుంగవులు హిమాలయ పర్వత ప్రాంతముల వసించుచు ధ్యానమగ్నులై యుందురు. కాన నేనును అట్టివారల యడుగుజాడల ననుసరించి ఉత్తమ సన్న్యాసినై యుందు' నని ధీరునివలె వారలకు సమాధాన మొసంగి వాగ్బంధము గావించును. అవ్యక్తముగ నేదియో ఉత్తమాదర్శము, భావకందకుండు కాలముననే ఆ పసిబాలుని హృదయమున నంతర్గతమై మనుల జూడ భావికాల మహాత్ముల జీవితములు చిరుత ప్రాయముననూడ సామాన్యుల జీవితము లతో బోల్పరానివను నిశ్చయము వ్యక్తమగుచున్నది. ఆట పాటలలోగూడ నా బాలుడు తాను మహారాజాధిరాజుగను, స్నేహితు లెల్లరు రాజపరివారముగను, ఆ పరివారము వినమిత శిరస్కులై తనకు రాజ్యవిషయముల శ్రద్ధాభక్తులతో నివేదించి నట్లును, అట దన తీర్మానముల వారికి దెలిపి ఆజ్ఞాపాలనము గావించినట్లును క్రీడించెడివాడు. అవును, ఆ బాలుని నామమే నరేంద్రనాథుడని సూచించుచున్నది గదా! సింహకిశోరమైనను ఎట్లు మదగజముల కుంభస్థలముపై లంఘించి జీల్చిచెండాడునో అట్లే యీ మహానుభావులకు బాల్యమునుండియు నా ధైర్య

స్థైర్యాదిక ఉత్తమ లక్షణములు పట్టుగొమ్మలయ్యె, వారి వాక్కులు సహితము తదనుగుణముగనే వెల్వడుచుండును. మక్షికము క్రుళ్ళుపదార్థముల చెంతకును, భృంగిమము మకరందము దెసకును బోవుటయు ప్రకృతిసిద్ధమేగదా ! అందుచే భర్తృహరి 'న ఖలు వయస్తేజసో హేతుః' ప్రతిభాశీలురకు వయస్సుకారణము కాదని తన నీతిశతకమున వచించియుండనోపు ! అట్టివారు కారణజన్ములుమాత్రమే. వారి వచనములు చైదములు భావిభాగ్యోదయ సూచికములై యొప్పారుచున్నవి.

ఒక్కొక్క సమయమున దమ గుఱ్ఱపుబండిని త్రోలువానిజేరి నరేన్ 'నేనుగూడ నీవలెనే ఉన్న తాసనమునుండి బండి త్రోలువాడనుగ గావలయు' నని పలుకుచుండెడివాడు. నిజమే, ప్రపంచమున సంసారతాప కీలికల బాధజెందుచున్న వారికి ముక్తి నొసంగుటకు, జ్ఞానహయముల బూన్చిన భక్తిశకటము నధిష్ఠింపబోవు నాటి నరేంద్రనాథుని భావమం దెట్టి యంతరార్థమిమిడి యున్నదోగదా !

తల్లి సుగుణఖనియై శీలవతియై ప్రజ్ఞానిధియై భక్తితత్పరయై యొప్పిసచో బిడ్డలును అవ్విధముననే జెలరారుచుందురు గదా! అట్టి సత్పుత్రులచే వంశము పునీతమై కీర్తి ప్రతిష్ఠల కాకరమగును. బాల బాలికల సత్ప్రవర్తనకు, వారల యభివృద్ధికి దల్లియేగదా మూలకేంద్రము! ఆమూలకేంద్రమగు నావ్యక్తిపైన సర్వమాధారమై యున్నది. అవును, గృహస్థ జీవనమునకు గేంద్రమైన మాతాపితలపై సంతానమును, రాజకీయ కేంద్రమగు నాయకోత్తమునిపై అనుచర సంఘమును,

దేశకేంద్రమగు ప్రభువుపై ప్రజానీకమును, సర్వప్రపంచ కేంద్రమగు గురువరేణ్యునిపై ఆధ్యాత్మిక ముముక్షు సంచయమును ఆధారపడియున్న వనుటకు మన ప్రపంచచరిత్రలే దార్కాణములు. కేంద్రస్థానములే అక్రమరీతినుండిన వాని నాదర్శముగ గొనిన ఆ యా సంఘము లేమి సాధించగలవు? కాని మన నరేంద్రనాథుని జీవితమునకు ప్రథమమున నాతని జననీజనకులిర్వురును ఉత్తమ ప్రాతిపదికగా రాజిల్లుటయే యిందలి ఘనత. ప్రథమ కేంద్రమే ఆతని జీవితమున సక్రమరీతి నుండుటచే నాతడు ఒక్కసారిగ విశ్వకేంద్రమగు శ్రీ రామకృష్ణ గురుదేవుని పాదసన్నిధికి దుమికి ఆధ్యాత్మిక జ్ఞాన పీయూషము నాస్వాదించుట కధికారియై విరాజిల్లెను. అందుచే గురువొనర్చు అక్షరాభ్యాసమునకు ముందుగనే శిశువులకు అక్షరాభ్యాసము తల్లియొద్దనే ప్రారంభింపబడును. మరియు ప్రతివ్యక్తికిని ప్రప్రథమమున మాతృదేవితోడ గదా సంబంధము! మన నరేంద్రుడుగూడ మొదట జననివద్దనే వంగభాషను, చిన్న చిన్న ఆంగ్లపదములను అభ్యసించెను. ఆవిద్యతోబాటు ఆతడు తన మాతృమూర్తి బోధించు రామాయణ మహాభారతాది పురాణ గాథలగూడ శ్రద్ధతో నాలకించుచు భక్తిని బెంపొందింపజేసికొనెను.

'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' శ్రద్ధాయుక్తునకే జ్ఞానము లభ్యమని గదా గీతాసూక్తి. మరియు 'శ్రోతవ్యః' అని శ్రవణమే ఏ జీవితమునకైనను ప్రథమ సోపానముగ ఉపనిషత్తాత్పర్యము. శ్రవణముచే బుద్ధి వికసించును ఆ బుద్ధి వికాసముచే విషయ పరిశీలనాజ్ఞాన ముదయించును. దానిచే వివేకము

కలుగును. ఆ వివేకముచే విరాగము జనింప, సద్గురు గవేష ణముజేసి, ఆశ్రయించి, సాధనలసల్పి, అనుభవ మహోదధి నీదులాడి ఆనందమును బడయుట. అట్లు శాస్త్రవచనాను సరణి బసితనమాదిగ నాచరించిన గదా శాస్త్రాతీతమగు సమాధ్యను భూతుల నిమగ్నమగుట! పై వచించిన విధమున శ్రీమద్రామా యణమును శ్రవణము గావించునప్పుడే, ఆ రామచంద్రుని సర్వాదర్శమును, జనకుని మురిపెంపు తనయయు, బతివ్రతా శిరోమణియు, బవిత్రతకు బవిత్రతనొసంగిన సీతామహాసాధ్వి పవిత్రతయును హృదయఫలకమున జిత్రింపబడగా నొక దిన మున, సీతారాముల మూర్తుల దెచ్చి, సౌధోపరి భాగమున ముచ్చటగా నలంకరించి, ఒకవేదికపై నమర్చి, వాని కభి ముఖుడై యాసనమున గూరుచుండి, ధ్యాన నిమగ్నుడయ్యెను. బాలు డేచటను నుదయమునుండి కాన్పింపకుండుటచే సర్వత్ర అన్వేషించిన నాతని తల్లిదండ్రులు తమ మేడ పై భాగమున వెతకుట కేతెంప నా గదిద్వారములోన బంధింపబడియుండెను. దానిని గాంచి వారు నరేంద్రుడు లో గలడని సంతసించి, కవా టముల శబ్దముచేసియు, పిలిచియు సమాధానము నొందరైరి. భయాందోళనములు మేళవింప, వ్యాకుల చిత్తులై, పుత్రు డేమాయెనో యని దిగులొంది, తక్షణ మాకవాటముల బగుల గొట్టించి వారు లోనికేగిచూడ, బయటజేయు శబ్దములచే భంగములేని ధ్యానమగ్నుడై నిశ్చలముగ నివాత దీపచందమున మన బాల నరేంద్రుడట గూరుచుండియుండెను. ఆ తల్లియు నాశ్చర్యమగ్నయై, ఆనందకందళిత హృదయయై మెల్లన బిడ్డ దరిజేరి, కరమున ప్రేమమై భుజము దట్టుచు, 'నరేన్, నరేన్'

అని నెమ్మదిగ బిలువ, గలువ రేకుల ధిక్కరించుచున్నవో యను
నట్లు దోచు దన విశాలనేత్రముల దెరచి, ప్రశాంత దృష్టుల
దల్లిని వీక్షించి, చిరునవ్వు ముఖమున జిందులు త్రొక్క
'అమ్మా! నీ వెపు డిట కరుదెంచితివి? నీవే రాముని సర్వా
దర్శమును బోధించితివో ఆ రామభద్రునే నేను ధ్యానించు
చుంటిని. ఆ యాదర్శముల బొందవలయు నని బలికితివే!
చూడుమమ్మా! వేదిక నెంత అందముగ నలంకరించితినో!
బాగుగనున్నదా?' అని ఉత్సాహముప్పొంగ నేమేమియో
పలుకు ఆ సుతుని భువనేశ్వరీదేవి గాఢాలింగనము గావించు
కొనుచు 'ఏమి! చిరుప్రాయముననే వీని కింత ధ్యాననిమగ్న
తయా! ఇపుడే వీడిట్లుండిన నిక వీని భావిజీవిత మెట్లు వెలు
గొందునో! వీడు నా మామగారగు దుర్గాచరణ దత్తమార్గము
ననుసరించి సన్న్యాసియగునేమో!' యని మనమున భావించుచు
నరేంద్రనాథునితో గ్రిందికి అరుదెంచెను. యథార్థమే, గంటల
పర్యంతము పూజామందిరముల గూర్చుండి జపాదుల సలుపుచు
మనస్సు ఏకాగ్రత నొందకుండుటచే విసుగుకొనువా రుందురు
కాని పిడుగులు పడినను జలింపక నిశ్చలస్థితి నుండువా రెంద
రుందురు? అట్టి నిశ్చలత్వ మలవడ వలయుననిన బవిత్రత గావల
యును. ఆ పవిత్రతయు విషయ విముఖుల జన్మహక్కు. అట్టి
స్థితి పూర్వజన్మ సుకృతఫలము. లేనిచో నంత గాఢనిశ్చలత్వము
సామాన్యులకు సాధ్యమగునా? కాదు.

మరొక పర్యాయము, వివాహము సర్వవినాశక హేతు
వనియు, సర్వానర్థములకు గారణమనియు గొందరి పలుకులా
చిరుహృదయమునకు ములుకులై నాట 'వివాహమే అన్నికష్ట

ముల గలిగించిన శ్రీరామచంద్రు డెందులకు బెండ్లియాడెను?'
అని మనమున దర్కించి, సీతారాముల విగ్రహముల నావల
నునిచి, ఆస్థానమున జితేంద్రియుండును, యోగీశ్వరుండును,
వ్యాఘ్రాజిన ధారియు, సర్వజ్ఞుడును, త్రిగుణముల వశము
గావించుకొనినట్లుగ సూచించు త్రిశూలధారియు, దపస్సంపన్ను
డును, సమాధిరతుడును, భస్మధారణముచే బృథ్విని, గంగా
ధరుడగుటచే జలమును, ఫాలలోచనముచే నగ్నిని, బన్నగ
భూషణుడగుటచే వాయువును, దిగంబరత్వముచే నాకాశమును
అను పంచ మహాభూతముల జయించి మేన ధరించియున్న
వాడును, సర్వ ప్రాపంచిక విషయముల భస్మముగ ధరించి
యున్న శ్రీ శంకరుని నిలిపి ధ్యానాదుల మునింగెను. 'ఉపభుంక్తం
విషం హంతి విషయా స్స్మరణాదపి' భుజించిననే విషము
చంపును కాని విషయములు స్మరించుటచేతనే నశింపజేయు
ననుచందము విషయముల విషతుల్యముగ గ్రహించియే
కాబోలు వివాహవిషయమును మిగుల హేయముగ నాతడు
చూచెను. ఆతని విరాగ బుద్ధికి సతీసమేతుడైన భగవానుడు
హేయముగనే పొడగట్టెను. గృహస్థమునకు, సన్న్యాసము
నకును గల తారతమ్యమును స్పష్టముగ నాడే నరేంద్రుడు
గ్రహించెను.

రామభక్తాగ్రేసరుండును, ధైర్యశాలియు, దాస్యభక్తి
కాదర్శ రూపుడును, రామకార్య నిమగ్నుడును, ఆజన్మ బ్రహ్మ
చారియు సంతత రామనామధ్యాన తత్పరుడును, నవవ్యాకరణ
వేత్తయు నగు వాయునందనుం డనిన నబ్బాలునకు ఎక్కు
ప్రీతి. కదళీవనమున నంజనీసుతుం డుండునని యొక పౌరా

కుడు తెలుప నొకనాటి నిశీధియంతయు నరటితోటఁ గుమ్మరి, ఆంజనేయుని గానక విసివి గృహమున కేతెంచెను. తండ్రియగు విశ్వనాథుడు యీ విషయమును విని 'రామకార్యార్థమత డెట కేపి యేగియుండు'నని చిన్ని నరేంద్రుని యూరట పరచెను. ఆ పట్టుదల నరేంద్రుని వివేకానందునిగ జేసినదై, మరణపర్యంత మాతని వీడలేదు. ఎన్ని విఘ్నములు వాటిల్లినను మహాపురుషులు పట్టుదలను వీడరుగదా! అందుచేతనే, 'విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః ప్రారబ్ధ ముత్తమజనా న పరిత్యజంతి' విఘ్నములచే మరల మరల నడ్డగింపబడినవారైనను ఉత్తములగువారు తమ కార్యముల ద్యజింపరు అని భర్తృహరి వాకొనుచున్నాడు.

నరేంద్రునకు జిన్నవాటినుండియే సంస్కృతభాష కాధారమగు అమరము కంఠస్థమయ్యెను. సర్వ విజ్ఞానములును దేవభాషయగు సంస్కృతముపైగదా ఆధారపడుట! పరివ్రాజకజీవితమున సంస్కృతాభ్యాసము చేయుచుండునపుడు చిన్ననాటి యమరకోశపాఠ మతనికి మిగుల దోడ్పడెను. అందుచే నచిరకాలమున నతడు సంస్కృతభాషా కోవిదుడై వెలుగొందెను. ఈ సంస్కృతభాషయే వేదాంతవిజ్ఞానమునకు బట్టుగొమ్మ. సర్వవేదాంత విజ్ఞానవాహిని, భారతజాతీయత,సంస్కరణావిధానము యీ అమృతభాషయందే కలవని ఆ మహానుభావుడు నాడే గ్రహించెను. మరియు కేవలము వివేచనము లేని కంఠస్థ విద్యయేగాక, తండ్రియగు విశ్వనాథుడు కుమారుని ననేక ప్రశ్నల నడుగుచు విమర్శనా బుద్ధిని బుత్రునకు అభివృద్ధి యొనరించెడివాడు. అట్టి సదవకాశముల గలిగించి సుతుని

ధీవికాసమునకు గారణభూతుడైన విశ్వనాథదత్తు డెంత విశాల బుద్ధి గలవాడు ! అందుచేతనే 'తండ్రి హరి జేరు మనియెడు తండ్రి తండ్రి' యని భాగవతము నొక్కి వక్కాణించుచున్నది. కుమారుని ధైర్య సాహసములకు సత్యసంధతకు, దయార్ద్ర హృదయమునకు, భక్తి సంపన్నతకు దల్లి కారణభూతయైనచో, విశాల హృదయమునకు, సునిశిత ధీకౌశల్యమునకు, దాన శీలతకు, కార్య శూరత్వమునకు హేతుభూతమైనవాడు తండ్రి యగు విశ్వనాథుడు. అవును, హృదయప్రాధాన్యము గలది స్త్రీ. మనోదార్ఢ్యత గలవాడు పురుషుడు. హృదయము ప్రేమకు నిలయము, మనస్సు ధీకుశలత కాటపట్టగును. మనో హృదయ తత్త్వదయ మేకీభవించి ఎవని జీవితమునకు సారథ్యము వహించునో వాడు అజేయుడు. వానికి ముక్తి హస్తగతము. అందుచేత 'హృదా మనీషా మనసాభిక్లుప్తః' అని ముండక శ్రుతి మనోహృదయద్వయ ప్రాధాన్యమును బ్రస్ఫుటపరచు చున్నది. పై వచించినదెరంగున జననీ ప్రబోధితమగు ప్రేమను, జనకాదేశమగు మేధాసంపదను సంపూర్తిగ నవగాహన మొన రించికొని, హృదయప్రధానుడై అనుభవరాశిని, మనోప్రాధా న్యమున జ్ఞానయశస్సును బొంది నరేంద్రుడు వివేకానందుడై యలరారెను. 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' అనియేగదా శ్రుతి వచనము.

తల్లియగు భువనేశ్వరి యథార్థముగ నరేంద్రునకు లోక జననియగు భువనేశ్వరిగనే గోచరించెడిది. మాతృభక్తిపరా యణుడుగదా నరేంద్రుడు! ఆతల్లి ఎంతటి మహోత్కృష్టోపదేశ ముల నొసర్చెనో, వాని తానెట్లు ఆచరించి ప్రపంచాదర్శ

పురుషుడయ్యెనో మొదలగు విషయముల ననేకపర్యాయములు మహాసభలలో వివేకానందుడు ఎలుగెత్తి చాటి ఆనందించెడి వాడు. 'నాయనా! నీవు యథార్థమని న్యాయమని విశ్వసించిన కార్యమును బ్రహ్మాది దేవతాగణ మెదురు తిరిగినను చేయుట మానకుము' అనియు, 'బిడ్డా! నీ సదభిప్రాయముల ద్యజింపకుము. పరుల ఉద్దేశములగూడ సహనమున స్వీకరింపుము' అనియు, 'సత్కార్యములనొనర్చి యిట్టి గుణవంతుడు వేరొకడు లేడని లోకమున గీర్తి నార్జింపుము' అనియు, 'సర్వకాలముల ధీరుడవై యుండుము' అనియు బోధించు ఆ చల్లని తల్లి యుపదేశతతిచే బసితనమాదిగ ధైర్యసాహసాది గుణముల కాలవాలమై, పిదప వివేకానందుడై, అన్య దేశమగు పాశ్చాత్య దేశమున ధీరుడై, Let the Lion of Vedanta roar వేదాంత సింహము గర్జించుగాక యని ఉపన్యాసాంతమున గర్జించుట ! కావున 'ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధి శ్శక్తిః పరాక్రమః। షడైతే యత్ర తిష్ఠంతి తత్ర దేవోపి తిష్ఠతి॥' ఎట ఉత్సాహ, సాహస, ధైర్య, బుద్ధి, శక్తి, పరాక్రమ షట్కముండునో అట దైవమును వసించునని శాస్త్రవచనముగదా ! అట్లు 'మాతృ దేవో భవ' అను వాక్యము నతడు ఆచరించి బోధించెను. అందుచేతనే మాతృభూమియన్నను, గన్నతల్లి యన్నను అతనికి ఎక్కుడు ప్రేమ గౌరవము లుండెడివి. 'మాతృ దేవత నారాధింపనివా డున్నతి కెన్నడు రాజాల' డని బోధించెడివాడు వివేకానందుడు. అవును, మాతృభక్తి లేని వానికి రాజభక్తి కలుగు టెట్లు? రాజభక్తి లేనివానికి దేశభక్తి ఎట్లు? అది లేనిచో గురుభక్తి ఎచ్చట? అదియు లేనిచో దైవ

భక్తి దుర్లభము. ఆ దైవభక్తియే లేకున్న మానవజీవిత గమ్యము దుస్సాధ్యముగదా! పై రాజ, దేశ, గురు దైవభక్తి చతుష్టయమునకు ప్రాతిపదికగదా మాతృభక్తి. సర్వార్థాత్మికానంద సౌధమునకు బునాదియైన మాతృభక్తిని గలిగి యుండుటచేతనే వివేకానందునకు లోకపూజ్యత సంప్రాప్త మయ్యెను. ఆ మాతృభక్తి లేకయే దేశసౌభాగ్యము కుంటువడి కష్టములు సంప్రాప్తము. కాన మాతృభక్తిని ఎల్లరము సంపాదింప యత్నించెదముగాక!

నరేంద్రుడు బాల్యమున కేవలము విద్యావ్యాసంగము ననేగాక అప్పుడప్పుడు తన బుద్ధిని సంగీతముపై ప్రసరింప జేసెడివాడు, అతడు తన మృదుమధురమగు కంఠము నెత్తి గానము చేయుచో వినువారలు తన్మయత్వము జెందెడివారు. మిత్రబృందమేగాక మాటిమాటికి నరేంద్రునిచే బాడించు కొనుచు నా గానకళా నైపుణ్యతకు ముఖ్యముగా శ్రీరామ కృష్ణ పరమహంసదేవు డానందించుచుండెడివాడు. నరేంద్రు డరుదెంచిన వెంటనే 'నరేన్, ఒక కీర్తనను పాడుము' అని ఆదివ్యగానమును గ్రోలుచు నాతడు సమాధినిమగ్ను డయ్యెడి వాడు. నాటి సుప్రసిద్ధ గాయకులగు అహమ్మద్ ఖాన్, వేణీ గుప్త మొదలగువారియొద్ద కొంతకాలము ఆకళను నరేంద్రు డభ్యసించెను. 'సంగీత శాస్త్రజ్ఞానము సారూప్య సాధనమే మనసా' అనియు, 'సంగీతజ్ఞాన విహీనులకు మోక్షముగలదా?' అనియు త్యాగరాజు దాని గీర్తించెనుగదా! రాగమునకు నను రాగము జోడించి హృదయపరిపాకము గావించుకొనుటకును, భగవద్దర్శన ప్రాప్తికిని సంగీత ముపయుక్తమని నరేంద్రుడు

విశ్వసించెను. మరియు 'సాహిత్య సంగీత కళావిహీనః సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః' సాహిత్య సంగీతకళా విహీనుడైనట్టివాడు తోకయు కొమ్ములులేని పశువను భర్తృహరి వచనానుసరణిగాక, సర్వవిద్యాకళా ప్రభావమును మన నరేంద్రుడు చిన్ననాడే గడించెను.

సామాన్యముగ బాల్య సంస్కారజాలములే తొలి నవ్యక్తముగనుండి, పిదప వ్యక్తమై అవకాశ వినియోగమున నభివృద్ధిగాంచును. అట్లే నరేంద్రునిలోగూడ, బాల్యమునుండి యౌవనమున గాలిడినంత ధైర్య సాహసము లందేమి, వ్యాస రచనలలోనేమి, గానకౌశల్యముననేమి, వక్తృత్వముననేమి, సర్వవిషయములలో బాల్యసంస్కారములు విజృంభించి ప్రకాశింపసాగెను. కళాశాలా గ్రంథాలయమున స్పెన్సర్, కాంట్, ఆరిస్టోటల్ మొదలగు పాశ్చాత్య తత్త్వవేత్తల గ్రంథముల నామూలాగ్రము బఠించి వారి సిద్ధాంతముల మనమున బదిల పరచికొనెను. అందుచేతనే కాలాంతరమున నమెరికాలో నుపన్యసించునపుడు ప్రాక్ప్రతీచీ సిద్ధాంత తారతమ్యమును జిత్రించి ప్రాగ్దేశతత్త్వముల యాధిక్యతను జాటెను. అందుచేత అచ్చటి పండితవర్గము వివేకానందునికి దాసానుదాసులై మెలంగిరి.

## పరివేదన

ఇట్లు సర్వవిధముల సర్వతోముఖాభివృద్ధి నొందుచున్నను, మన నరేంద్రుని హృదయమున ననుద్భూత రూపమై యేదియో గ్రహింపరాని యావేదన అంతర్గతమై

రీయుప్పుచుండెను. అదియే ఆధ్యాత్మిక తృష్ణ. ఆ తృష్ణయే ఆధ్యాత్మిక మార్గమున ప్రథమ సోపానము. అట్టి ఆధ్యాత్మిక పిపాసతో నలమటించిన హృదయమే భగవదనుభూతిని శీఘ్ర గతిని గలుగజేయును. కళాశాలయందు అతడు విద్యాదుల మునిగియున్నను, ఉపన్యాసముల నొసంగుచున్నను, క్రీడా వినోదాదుల బాల్గొనుచున్నను దృప్తిజెందక, మానవజీవిత పరమావధి ఆహార నిద్రాదులచే నగు సౌఖ్యమున గలుగ దనియు, విషయసుఖములు బుద్బుదములవలె క్షణికములై తుచ్ఛములనియు, 'జ్ఞానీ నరాణా మధికో విశేషః జ్ఞానేన హీనః పశుభిస్సమానః' మానవులలో జ్ఞానియే అధిక విశేషము గలవాడనియు, జ్ఞానహీనుడు పశుతుల్యుడనియు గ్రహించి, జ్ఞానమే ముక్తిప్రదాత యనియు, జ్ఞానమే సర్వముకంటె నధిక తరమనియు, జ్ఞానమున నిమగ్నతనొందుటే మానవ జీవిత గర్తవ్యమనియు, శాశ్వదానందము ననుభవించి ఆతన్మయత్వ మున నీదులాడుటయే యుత్కృష్టాదర్శమనియు లోలోన దర్శించుకొనుచుండును. మోక్షసామ్రాజ్యము నధిష్ఠింప లౌకికవిద్య యనవసరమని విశ్వసించెను. విద్యచే గల్గు ఫలిత ములు అనిత్యములనియు, ప్రాపంచిక విద్యచే శాశ్వతమైన అమృతత్వము నాశించుట వెర్రియనియు, ప్రపంచసుఖముల భ్రాంతిగా నిర్ణయించి, త్యజించి, యీ జగత్తను యుద్ధరంగ మున విశ్వసించిన సత్యమునకై వెన్నుజూపక నెదురు నిలిచి పోరు వీరుడై, యీ కల్లోలిత ప్రపంచసాగరమున శాంతి నుండు సన్న్యాస జీవితము శ్రేష్ఠమనియు, అదియే తన జీవితా శయమనియు భావించెడివాడు.

ఇట్లు తీవ్ర మోచనాభరితుడై యుండునప్పుడు, యౌవన ప్రాయమున, జనకులు వివాహయత్నముల గావింప నయ్యది యనర్థదాయకముగ ద్రోసిపుచ్చెను. కాని వివాహమును ద్యజించినమాత్రమున ముక్తి లభ్యము కాదుగదా ! భగవత్సాక్షాత్కారము నొందినవారిని దర్శించి, వారి సన్నిధినుండి, వారి యనుగ్రహ వీక్షణములకై నిరీక్షించి, వారి మార్గానువర్తియై యనుసరించి, అనుభవము సంపాదించిన గదా నిర్వాణపదము నలంకరించుట ! అందుకై తుచ్ఛ సౌఖ్యముల వర్జించి, బంధవిమోచనమునకై ప్రాకులాడుచు తన హృదయావేదన నణచి, శాంతిని బ్రసాదింప భగవదనుభవపరులకు సాధ్యముగాన, నట్టి మహావ్యక్తికొరకై యన్వేషింప సాగెను. ఆ భగవద్ధావేదన తీవ్రతరమైన కొలది ఆనందప్రాప్తి నొసంగు వారిగూర్చి గవేషణయు దీవ్రతరమగును. ప్రపంచ సుఖములు స్వేద బిందువులచే సంప్రాప్తముగాని, ఆధ్యాత్మికానంద విభూతిమాత్రము రక్తము దీసినను కలుగదు. కాన సేవలాన్వేషణమేగాక దానికై ప్రాణమునైనను ద్యాగము జేయుటకు సంసిద్ధుడై మన నరేంద్రుడుండెను.

కాన నాధ్యాత్మిక బడబానల తప్త హృదయుడై, భగవత్సాక్షాత్కారములేని జీవితము వ్యర్థమని నిశ్చయించి, తదుణోపాయమునకై నాడు ప్రముఖస్థానముననున్న బ్రహ్మసమాజమున బ్రవేశించి, దేవేంద్రనాథ ఠాగూరు ననుసరించి, ధ్యానాదుల సల్పుచుండెను. ఈశ్వరుడు వివిధరూపమున నుండక నేకమనియు, నతడు ఆకారశూన్యుడై యుండియు, భక్తుల గటాక్షింప ప్రేమాది సుగుణ సహితుడను వారి

సిద్ధాంతములు తోలుత నరేంద్రుని ఆకర్షించెను. కాని దేవేంద్రుని పనుపున నెంతకాలము సాధనల సాగించినను తనకు శాంతి లభింపకుండుటచే, నీశ్వర సాక్షాత్కార వంతుడే యితరులకు శాంతి ప్రసాదింపగల్గునను విశ్వాస మున, దేవేంద్రుని యనుభూతినే సంశయించెను. అందుచే నావిషయమును నిశ్చయించుకొన నొకనాటి సాయంసమయ మున గంగానదిపై విశ్రాంతిగొన నావపై జన నుద్యుక్తుడై యున్న దేవేంద్రుని, భగవత్పిపాసా పీడితుడై నరేంద్రుడు ఎదుర్కొనెను. పడవయొక్క గదిలో ధ్యాననిమగ్నులైయున్న దేవేంద్రునికి ఎదుటనిలచి, 'మహాశయా, తాము భగవంతుని దర్శించితిరా?' యని నిర్భయుడై నిశ్చలుడై నరేంద్రుడు ప్రశ్నించెను. ఆప్రశ్నమునకు దగు సమాధానము బడయక వెంటనే వెనుదిరిగి, పునః తీవ్రావేదనా కీలికల దహింపబడు హృదయమున, భగవత్సాక్షాత్కారప్రాప్తినొంది తన కాత్మ శాంతి నొసంగగల మహాత్మునికై నతడు వెదుకగడంగెను.

ప్రపంచమున సకలమును సులభసాధ్యమే కాని సద్గురు ప్రాప్తిమాత్రము మిక్కిలి కష్టము. కావున శ్రీ శంకరా చార్యులు 'దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహహేతుకం। మానుషత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥' మానుషత్వము, మోక్షేచ్ఛ, మహాపురుష సన్నిధి యను నీ త్రయము దైవానుగ్రహము వినా లభ్యమగుట దుర్లభమని ఎంత తీవ్రముగ జింతించిరో తమ వివేకచూడామణి యందు నీ చక్కని శ్లోక రాజమును విరచించి యుందురు. అది యథా ర్థమే. పరిణామక్రమమున వృక్ష క్రిమి కీటక పశ్వాదిజన్మల

ధరించిన జీవి 'జంతూనాం నరజన్మ దుర్లభం' జంతువులలో మానవజన్మ దుర్లభమనురీతి జిట్ట చివరకు మానవుడై జనించును. ఆ నరజన్మమునసైనను, సత్వ రజ స్తమోగుణ త్రయమునగల తామస రాజస ప్రధానుడుగగాక సత్వగుణాధిక్యమున వివేకవంతుడగు మానవుడైనచో మానుషత్వ ప్రాప్తియగును గాని లేనిచో మానవుడన జెల్లదు. భగవంతుడు పశు పక్ష్యాదులగంటె మానవునకు వాగ్వివేకములను బరమోత్కృష్ట గుణద్వయమును ప్రసాదించియున్నాడు. వాని సక్రమోపయోగము జేసికొని వివేకవంతుడై విరాజిల్లినగదా మానవుడనబడుట! కాన పై నిర్వచనరీతి మానుషత్వము లభించుట ప్రథమము. అట్లు మానవత్వము సిద్ధించినను 'సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతే న్నాణాం మోక్షేచ్ఛా జాయతే' సత్కర్మపరిపాకముచే ననేక జన్మపరంపరాంతమున మనుష్యులకు మోక్షేచ్ఛ జనించును అను పైంగలోపనిషద్వచనసరణి భగవత్సాక్షాత్కార వాంఛ కలుగుట అంతకంటె గష్టము. అయిచ్ఛ సామాన్యముగ నెల్లరికి యుండును గదా యనిన అది తీవ్రతరమై, ప్రాపంచిక విషయ విముఖత్వము గలిగి విరాగముతో ప్రకాశించిన యథార్థ మోక్షకామ్యత యనవలయుగాని ఏదియో దుఃఖము ప్రాప్తించు సమయమున భగవదిచ్ఛ కలుగుటగాదు. కాన అట్టి తీవ్ర ముక్తికాంక్ష కలుగుట ద్వితీయము. అట్లు మానవత్వమును, మోక్షేచ్ఛయు సిద్ధింపవచ్చునుగాని సద్గురుదర్శనము గష్టాతిగష్టమని శాస్త్రవచనము. 'కిం దుర్లభం? సద్గురుర స్తి లోకే' లోకమున నేది దుర్లభమన సద్గురు ప్రాప్తియని శంకరులును తమ మణిరత్నమాలయందు

రచించియుండిరి. సద్గురువన నెవ్వరు? యని ప్రశ్నించుకొని సమాధానమును దిలకించుట యుక్తము. తీవ్ర జిజ్ఞాసతో నలమటించి, గురు చరణసన్నిధి జేరి, దివ్యానుభవముల ముగ్ని, ఆ ప్రశాంతతచే సర్వముముక్షువుల నాకర్షించి, చెంత జేరినవారి నిస్స్వార్థముగ వారి శ్రేయస్సు గాంక్షించి, సాధనల జేయించి, అందు ఉత్తీర్ణుల గావించువాడే యథార్థ గురువరేణ్యుడు. అట్టి వాడు లభించుట ముముక్షువుయొక్క పూర్వజన్మ కర్మ పరిపక్వత, తీవ్ర ఆర్తి, భగవదనుగ్రహములపై నాధారపడి యుండును. అట్టి గురుశిష్యుల సమ్మేళనమే జ్ఞానాభివృద్ధి దాయకముకాని నామమాత్రపు గురు శిష్యుల సంబంధముకాదు. ప్రస్తుత ప్రపంచమున నెల్లరు గురువులే కాని శిష్యులు గాన వచ్చుటలేదు. కారణము శిష్యత్వముకంటె నందరికి బోధించు గురుపదవియే సులభప్రదమేమో! ఆర్ష సంప్రదాయానుసిద్ధమైన గురువు లభ్యమగుదనుక శిష్యుడు సామాన్యుల నాశ్రయింపడు. అట్లే ఆర్షప్రోక్త సల్లక్షణోపేతుడైన శిష్యుడు సమకూడువరకు నన్యుల దరిజేరనీయడు గురోత్తముడు. ఇదియే పవిత్ర గురు శిష్య సంబంధము. అట్టి ఉత్తమ గురుప్రాప్తి తృతీయము. పైవిధముగ మానవత్వ లక్షణము లన్నియు సంపూర్ణమై, తీవ్ర మోక్షకాంక్షచే నావేదనబొందు మన నరేంద్రునకు నిక తృతీయమే సమకూడవలసియున్నది. అదియే సద్గురు సమాగమము. ఆ యావేదన పరిపక్వస్థితికి అరుదెంచిన గాని సద్గురుప్రాప్తి చేకూరదా?

తీవ్రముముక్షుత్వ బాధతో అనేక ఆధ్యాత్మిక గ్రంథముల బఠించుచు శాంతి నొంద నరేంద్రుడు యత్నించెను.

కాని గ్రంథములు యీశ్వరునివర్ణించునుగాని అనుభవింపజేయ గలుగునా? అట్టి యానందము నొసంగువారు మహాత్ములే గదా! అందుచేతనే నరేంద్రుడు వివేకానందుడై 'గ్రంథముల గుళ్ళ వెదకిన గలదె ఫలము?' అని యతిగీతమున వ్యక్తపరచి యున్నాడు. గ్రంథములు వర్ణించు పరమేశ్వరుని గనుగొన సంకల్పించుకొని నరేంద్రు డందులకు నుద్యుక్తుడయ్యెను. 'పందొమ్మిదవ శతాబ్దము' అను పత్రికయందు బ్రహ్మసమాజము నకు నాయకుడైన కేశవచంద్రుడు రచించిన A Real Mahatman 'యథార్థమైన మహాత్ముడు' అనుశీర్షికలో, శ్రీ రామకృష్ణ గురుదేవునిగూర్చి వ్రాసిన విషయమును జూచి, ఆశ్చర్యము నొంది, మరల పూర్వపు గురువగు దేవేంద్రనాథునిగూర్చి చింతించి,'ఎల్లరు వచించువారలే కాని భగవద్దర్శనము నొసంగు వారు లేరు. ఈ కేశవచంద్రుడేగదా పూర్వము దేవేంద్ర నాథుని గురువుగా వర్ణించెను. ఇపుడు యీ మహాత్ముడును ఆ దేవేంద్రునిలెనే యుండునేమో! ఎచటికివెడలినను హృదయ తాపమా సుమంతయు జల్లారుట లేదు. ఎవరి నాశ్రయించినను భగవద్దర్శనమా కలుగుట లేదు. జీవితమంతయు నన్వేషణము తోడనే యగుచున్నది. ఈ పర్యాయ మీ యథార్థమహాత్ముని గూడ దర్శించి సత్యాసత్యముల నారయవచ్చును' అని భావించి, వారి దర్శనముగూడసేయ నాతడు సంకల్పించెను. అట్లు సంకల్ప ముదయించినదాది దనకు దెలియకయే పలువిధ ముల దన హృదయము యథార్థమహాత్ముని దెసకు బర్వెత్తు చుండ నా దక్షిణేశ్వరమును గూర్చియు, నచటి దేవాలయ మునుగూర్చియు, యథార్థ యోగిపుంగవుడని కేశవచంద్రసేన్ చే

గీర్తింపబడిన నా శ్రీరామకృష్ణ పరమహంసదేవునిగూర్చియు నదేరీతిగ మనమున దలపోయుచు, నాతని దర్శనార్థ మేగుటకు దృఢనిశ్చయుడై మెల్లగ గృహమును జేరెను. అప్పటికే శ్రీ రామకృష్ణ సన్నిధానము నొంది ముఖ్యశిష్యుడై యలరారిన రామచంద్రదత్తు, తన బంధువగు నరేంద్రుని వీక్షించి, 'దక్షిణేశ్వరమునగల మాగురుదేవుడు శ్రీ రామకృష్ణ పరమహంస నీ వేదనను దప్పక జల్లార్పగలడు. వచ్చెదవా?' అని పలికెను. అంతకుమున్నే శ్రీపరమహంసదేవుని దర్శింప సంకల్పించియున్న నరేంద్రుడును సమ్మతించెను. ఇంతవరకు నరేంద్రుడై మొగ్గరూపముననున్న పుష్పము, మేఘావృతమైన శశిబింబము, నివురుగప్పియున్న యగ్ని, శ్రీ రామకృష్ణ సన్నిధాన సౌభాగ్యమున స్వతఃస్వరూపమున వివేకానందుడై తనరి, జగతిగల అజ్ఞాన తిమిరమును బాపి, వేదాంత నిర్మల ప్రకాశము నెట్లు ప్రసాదించెనో యిక గ్రహింతము.

పై విధానమున నరేంద్రుని సంస్కారముల గ్రహించి, తదనుగుణ శిక్షణమును ప్రేమతో నొసంగి, సర్వశక్తునిగ జేసి, ఆధ్యాత్మిక విద్యుల్లతరీతి ప్రపంచమున ప్రకాశింపజేసి, వివేకానందునిగా రూపొందించిన మహావ్యక్తి ఎట్టి యద్భుతాధ్యాత్మికానందామృతపాన నిమగ్నుడో గదా! అట్టి శ్రీ రామకృష్ణ పరమహంసదేవుని జీవిత మకరందమును మధుపములరీతి గ్రోల మన మొకించుక శ్రద్ధతో నరేంద్రుని శ్రీ రామకృష్ణ గురుదేవుని సన్నిధికి జేర్చి, ఆ గురుశిష్యుల అపూర్వ అవ్యయానంద సాగరమున మునిగెదముగాక.

# శ్రీ రామకృష్ణుడు

ప్రపంచమున ధర్మము క్షీణించి యధర్మాభివృద్ధి గలిగి నపుడు, ధర్మసంరక్షణార్థము, మోక్షార్థులకు ముక్తి నొసంగుటకును, జగదాధారమగు వేదశాస్త్రముల సముద్ధరణము నకును, అవతారవరేణ్యులు, సత్పురుషులు జనించుచుందురు. అంతియగాక, నిరాకారుడును నిర్గుణుడును నిరవయవుడును నిరంజనుడును నిర్వికారుడును అగు నా పరబ్రహ్మము సైతము 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' ఉపాసకుల కొరకుసగుణుడై సాకారుడై సావయవుడై యుద్భవించును. 'యస్య యాదృశీ భావనా తస్య తాదృశీ సిద్ధిః' ఎవనికెట్టి తీవ్రభావమో అట్టివానికి అట్టి సిద్ధియే కలుగును అను శాస్త్రవిధానమున బ్రహ్మమే నిర్మల హృదయులగు ఉపాసకులకొరకు 'అజాయమానో బహుధా విజాయతే' తా నజుడైనను బహువిధముల జననము గాంచుచున్నాడు. పై విధాన బ్రపంచమంతయు నిరర్థక పాశ్చాత్య నాగరికతా వ్యామోహ బద్ధమై, దైవవిశ్వాసమును గోల్పోయి, సత్సంప్రదాయమును మరచియున్న కాలమున, గలకత్తకు సుమారు ఎనుబది మైళ్ళదూరమున కామారి పుష్కరిణి యను నొక కుగ్రామమున, దైవభక్తులును, ప్రేమ స్వరూపులును, సత్య విభూతులును అగు చంద్రామణీ క్షుదీరామఛటోపాధ్యాయులను బ్రాహ్మణదంపతుల పవిత్ర గర్భవాసమున, 1836వ సంవత్సరమున ఫిబ్రవరి 17వ తేది సరియగు ఫాల్గుణ శుద్ధ విదియ బుధవాసరమున, శివకేశవ స్వరూపుడై

ప్రపంచ బాధలగ్రస్తు దీనుల నుద్ధరించు సత్సంకల్పముతో బర మేశ్వరుడు గదాధరనామమున జనించెను. సత్పురుషుల గుణ గణముల వర్ణించుచు 'దుఃఖితే కురు దయాం' దుఃఖము నొందువారిపై దయను వర్షింపజేయుదురని భర్తృహరి వచించియున్నాడు.

ఇట్లు జన్మసిద్ధుడును, అవతారపురుషుడు నగుటచే నాశిశువు బాల్యమునుండి యనేక లీలల దల్లియగు చంద్రా మణికి జూపి, 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' యను ఆర్యోక్తిసరణి బ్రపంచ అసత్యత్వమును గ్రహించియు, బ్రపంచమునకు నూతనాదర్శమును బ్రకటింప, దన యిరువది నాల్గవయేట మాతృ యాజ్ఞానువర్తియై, జయరామవటి గ్రామనివాసినియు, బంచ వర్షప్రాయయు, కేవల జగన్మాతృ స్వరూపిణియు నగు శారదా మణీదేవిని బరిణయమాడి, ఆమెను తన మాతృదేవిగా గౌర వించుచు, బూజించుచు, గలకత్తకు ఉత్తరమున గల దక్షి ణేశ్వర కాళికాలయమున జగదాధారమగు కాళికనర్చించుచు, దీవ్రసాధనా భరిత హృదయమున మాయా దర్శనప్రాప్తి నొంది, సర్వాధ్యాత్మికానుభవ సమేతుడై, నిర్వికల్పసమాధి శిఖరము నధిష్టించి, త్యాగమూర్తియై, సర్వవిశ్వగత మానవ కోటికి జ్ఞానామృతమును బంచిపెట్టుచు, సర్వాదర్శప్రాయుడై శ్రీ రామకృష్ణదేవుడు విలసిల్లి యుండెను. శ్రీ రామకృష్ణ కుసుమరాజ జ్ఞాన సుగంధ వాహినులు సర్వప్రపంచమున బ్రసరించి యావరించుచుండెను. ఈ పరిమళము నాఘ్రాణిం చియే, యీ యాధ్యాత్మిక పుష్పరాజమున గల సర్వాను

భవరూప మధువు నాస్వాదించుటకు మన నరేంద్రనాధుడును శ్రీ రామకృష్ణదేవుని ఆశ్రయించెను.

## గురుచరణ సన్నిధి

పూర్వోక్తముగ రామచంద్రదత్తునిచే ప్రేరితుడై నరేంద్రుడు మరుసటిదినమే దక్షిణేశ్వరమునకు బయనమయ్యెను. నరేంద్రుడు దక్షిణేశ్వరాలయమును జేరుసమయమున శ్రీరామకృష్ణుడు తనచుట్టు గూరుచుండియుండిన భక్తులతో ప్రసంగించుచుండెను. నరేంద్రుడును లోనికరిగి కూరుచుండి గురువర్యు నాపాదమస్తకము విమర్శనాబుద్ధి బరిశీలించుచుండెను. గురుదేవుడును అతని జేరబిలిచి, కొన్ని కీర్తనల గానము సేయ గోరెను. అంత నరేంద్రుడు 'మన్ చలో నిజ్ నికేతనె, సంసార విదేశ విదేశీర్ వేషె భ్రమ కెనో అకారణె' ఓమనసా, అన్యదేశమగు నీ సంసారమున మను టెందులకు? స్వస్థానమునకు బోవుదము రమ్ము' అను అర్థమునిడు గీర్తనను దన సహజమృదుమధుర కంఠముతో బాడెను. యథార్థముగ నీప్రపంచమను విదేశమునుండి స్వస్థానమగు ఆత్మపురిని జేర గాంక్షించు ఆతని ఆర్తహృదయము బహిర్గతమగుటచే గాబోలు శ్రీ రామకృష్ణుడద్దాని నాకర్ణించి సమాధ్యవస్థను బొందెను. పిదప గురుపుంగవుడు నరేంద్రుని జేగొని వసారాలోని కేగి, చిరకాల పరిచితుని వోలె, బహుకాలానంతరమునకు గలిగిన మిత్రుని చందమున నరేంద్రుని సంబోధించుచు, 'నాయనా, నేటికైన నే తెంచితివి. సంతోషము. ప్రాపంచికుల నిస్సార ప్రసంగముల నేను విన

జాలకున్నాను. ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరులతో సంభాషింప నా హృదయము ఎంతయో ఆరాట మొందుచున్నది. నీరాకచే నాకాభయము దీరినది' అని ఆనందబాష్ప నేత్రుడై పలికిఅతనికి ఉపాహారముల నిడెను. నరేంద్రుడు సెలవుగైకొను సమయమున 'మరల త్వరలో రమ్ము' అని ప్రేమపురస్సరంబుగా వచించి పంపెను.

నరేంద్రునకు యీ సంయోగమువలన కొంత భారము తగ్గినట్లుగా దోచెను. కాని మనమున గొన్ని సందేహములు గన్పట్టెను. తన గృహమున కేతెంచి, 'ఆహా, అనేకుల దర్శించితిగాని యిట్టి వ్యక్తి నెచ్చటను గాంచలేదు. కేవల మున్మత్తునిరీతి గోచరించుటయే గాక, పూర్వము నా పరిచయ మున్నట్లు పలుకరించెను ! అంతయు నాశ్చర్యము ! ఈతడు భగవద్దర్శనము నొందెనా? అదిలేకున్న చో అట్టి విశుద్ధ ప్రేమ మూర్తి ఎట్లగును? ఆ మూర్తియందు ఏదియో యొక శక్తి గలదు. అది అయస్కాంతము లోహము నాకర్షించునటుల నా హృదయమును వశపరచుకొనినది. ఈ పర్యాయము అతనికి భగవదనుభూతి గలదో లేదో ప్రశ్నించి గ్రహించెదను' అని పలురీతుల దర్కించి, తన కగ్రాహ్యమగు ప్రేమ శ్రీ రామ కృష్ణునందు బెంపొంద నరేంద్రుడు కొన్నిదినములు గడిపెను.

మరల నొక దినమున నరేంద్రుడు శ్రీ రామకృష్ణ దేవుని దర్శింప నేగుదెంప, గురువర్యుడు ఆనందము ముఖమున జిందులాడ నతని గని, అచ్చటి భక్తులకు నతని బరిచయపర

చెను. అంత నరేంద్రుడు శ్రీ రామకృష్ణుని నైజస్థితి గ్రహింప 'దేవా, మీరు భగవంతుని గాంచితిరా?' అని ప్రశ్నింప నుంత యైన కాలవ్యవధి లేకయే 'అవును, భగవంతుని స్పష్టముగ గాంచితిని. మరియు నీవు కోరినచో జూపింపగలను' అని ఆతడు ప్రత్యుత్తరమొసంగెను. 'భగవంతునికై తీవ్ర హృదయ పరితాపమున విలపించినచో నతడు తప్పక సాక్షాత్కరించును. కాని యీ ప్రపంచమున ధన ధాన్య పశు పక్షి పుత్ర మిత్ర కళత్రాదులకై, మరియు ననేక అసత్య అల్పసుఖములకై దుఃఖింతురేగాని పరమేశ్వరుకొరకై విలపించు వారేరి?'అనియు గురువర్యుడు నరేంద్రునకు మరియొకసారి విశదపరచెను. పై సమాధానములచే శ్రీ రామకృష్ణునకు నరేంద్రనాథుడు ఇంకను సన్నిహితుడై వెలుగొందెను. పటమునందును, స్వప్నము నందును, భావమునందును ఈశ్వరదర్శనమునొంది సంతసించు వారలే ఎచ్చటైన గలరుగాని, భగవత్సాక్షాత్కారము ప్రత్యక్షముగ లభింపజేసికొని, దర్శించి, ప్రసంగించి, జిజ్ఞాసువులకు గూడ జూపగలవార లీ ప్రపంచమున గలరా? అందుచే నరేంద్రుని మానస మెట్లు ఆశ్చర్యానందముల మునిగి నిశ్చలత నొందెనో వేరుగ దెలుపవలయునా! అయినను శ్రీ రామకృష్ణుడు వెర్రివాడో, విరాగియో, పరమహంసయో, మహాత్ముడో, సిద్ధుడో నరేంద్రునికి సంశయము నివారింప బడకున్నను, తా నవ్యక్తశక్తిచే గురువరు సన్నిధానమున కీడ్వ బడుచుండుటను గ్రహించుచు ఆనందించుచు మానసమువరకు నరేంద్రుడు దక్షిణేశ్వరమున కరుగ జాలడయ్యెను.

ఆ గురుశిష్యుల సమాగమ మెట్లు పరిణమించి, సర్వ ప్రపంచాదర్శ మయ్యెనో కనుగొందము! ఆ యిరువురు వ్యక్తు లెట్లు ఏకత్వము నొందిరో గ్రహింపవలయునుగదా! అనాగరిక తల కాలవాలమై యొప్పు కమార్పుకూర్ అను చిన్న కుగ్రామ మున దైవభక్తి విలసితులగు సామాన్య బ్రాహ్మణ కుటుంబ మున శ్రీ రామకృష్ణుడు జననమొంద, నాగరికతలకు బట్టు గొమ్మయై, సర్వాకర్షణల ముంచి, ప్రపంచమున వేరెన్నిక గనిన కలకత్తానగరమున భగవద్భక్తులును, సుగుణశీలురు నగు నొక ధనిక కాయస్థ క్షత్రియవంశమున నరేంద్రు డుద్భవించెను. బాల్యమునుండియు దేవవిభూతుల నోలలాడుచు, 'బొట్టకూటి చదువులకో జన్మము' అనునట్లు ఈ ప్రాపంచిక విద్యల వలయు నంత మాత్రమే ఆ గురుపుంగవుడు గ్రహించియుండ, బసితన మాదిగ ధ్యానాదులలో నిమగ్నుడయ్యు, వానితో బాటు నీ యపరవిద్యలం దమిత మేధాశక్తి యభివృద్ధిసెంద, విద్యా సాగరమున దరిగాంచ నాతురతనుండె నీ శిష్యరత్నము. మరియు భారతీయార్ష విధానముల నాకళింపుజేసికొని, సగుణ సాకార సాధనలచే భగవత్సాక్షాత్కారమును గాంచి, భారతీయ సంస్కృతీ పర్యవసాన పారమార్థిక సంపదల దులదూగి, ప్రాచీన భారతీయాధ్యాత్మికోదధి తుల్య అపార జ్ఞానమును దనలో నేకమొనరించి, ఆ యవతారవరేణ్యుడు ప్రకాశించు చుండ, బ్రాహ్మసామాజికుల సంసర్గముచే సగుణారాధనా విముఖుడై, జనన మరణాద్యతీత మార్గాన్వేషియై తపించుచు, 'అనిత్య సంసారవిషయ బద్ధో దుఃఖం' అనిత్య సంసారవిషయ బద్ధత్వమే దుఃఖమను నిరాలంబోపనిష న్నిర్వచనరీతి, దుఃఖ

వివృత్తినిగాంచి, పరమానంద ప్రాప్తికై తీవ్రతర ఆవేదనకు గురియగువా డీ ముముక్షువు. ఆధ్యాత్మిక మార్గమున సత్యోన్నతమై వెలుగొందు నిర్వికల్పాది సమాధుల గరతలామలకము గావించుకొనిన సాధుపుంగవుడును, పరమహంసయును నై ఆ సిద్ధుడు తనరొంద, ఆ యాధ్యాత్మిక గమ్యమును సాధింప నిత్యానిత్య విచక్షణ జ్ఞానశీలుడై, బ్రహ్మచారియై, నీర క్షీర విభాగ మొనర్చి క్షీరమును మాత్రమే గ్రోలు హంసవలె 'క్షీరం బ్రహ్మ జగచ్చ నీరం' నీర క్షీరముల పగిదినుండు జగద్బ్రహ్మములయందు బ్రహ్మమునే గాంచ నభిలషించుచుండె నీ సాధకుడు. ఆంగ్లభాషా జ్ఞాన మిసుమంతయు లేక సంపూర్ణ, ప్రాగ్దేశీయ మూర్తిమత్త్వమును నిరూపించు ప్రాచీనవిశాలాద్వైత సామ్రాజ్య సార్వభౌముడుగా నా యతికుల చక్రవర్తి దీపించుచుండ, సంస్కృతాంగ్ల వంగ భాషాత్రయ కోవిదుడై, రూపమున బశ్చిమదేశీయునివలె గన్పట్టుచు, నత్యాధునిక భావజాలములో మున్గి, ఆ భావసంచయముచే బ్రపంచమును సంస్కరింపయత్నించు నాయకు డీతడు. సర్వసంగముల బాసి, సర్వద్వంద్వముల నతీతించి, నిశ్చలత్వమును సాధించిన ప్రశాంతచిత్తు డాతడై యుండ, సమస్త ద్వంద్వములచే బాధల నొందుచు, జంచలిత మనస్కుడై యుండు అశాంత చిత్తుడీతడు. హృదయమున, నిర్మల ప్రేమ సహితమైన జ్ఞాన ముదయించిన ఆధ్యాత్మిక సహస్రదళపద్మ మాతడై యుండ, ఆ జ్ఞానసౌరభము నాఘ్రాణించు ద్విరేఫ మీతడు. బాహ్యమునకు భక్తియు నంతరమున జ్ఞానమును సమ్మేళన మొనర్చు గురువుగా నా మహాత్ముడుండ, బాహ్యమునకు జ్ఞానమును అంతరమున భక్తియు

నేకముగ నుండువాఁడీ శిష్యుఁడు. వేయేల 'శమదమాద్యనేక సద్గుణ విశిష్టస్సన్ నిష్కళంకం నిరంజనం నిర్వికారం అద్వైతం ఏకం ఆకాశవత్సర్వత్ర భాసమానం పరబ్రహ్మ యో జానాతి స ఏవ బ్రాహ్మణః' అను వజ్రసూచికోపనిష న్మంత్రరీతి శమ దమాద్యనేక సద్గుణగణ విశిష్టుఁడై, నిష్కళంకమును, నిరంజన మును, నిర్వికారమును, అద్వైతమును, ఏకమును, గగనము వలె సర్వత్ర భాసించునదియు నగు బరబ్రహ్మను గ్రహించిన వాఁడే బ్రాహ్మణుఁడుగా సత్వగుణ సుశోభితుఁడై, బ్రాహ్మణవంశ సంజాతుఁడై యతఁడుండ, 'సర్వే రాజాశ్రితో ధర్మో రాజా ధర్మస్య ధారకః' సర్వధర్మములు రాజాశ్రితములై యుండ నా ధర్మమును ధరించువాఁడు నృపాలుఁడనియు, 'క్షత్రియస్య పరో ధర్మః ప్రజానామేవ పాలనం' ప్రజాపాలనమే సుక్షత్రి యుని పరమగు ధర్మమనియు మనుస్మృతి బోధించు విధమున భావికాలమున శ్రీ రామకృష్ణ సందేశముల బ్రజల హృదయ ముల జొప్పించి, ఏక ఛత్రాధిపతిగ బరిపాలన మొనర్చుటకు రజోగుణాభిభూతుఁడై, క్షత్రియ కులోద్భవుఁడుగా నీతఁడుండెను. ఇట్లు బాహ్యమునకు ద్వివిధముగ గోచరమగు నీ రెండు తత్వ ములు గంగాయమునా మహాస్రవంతులవలె నొకచో గలిసి, అద్భుత మహాప్రవాహమై జ్ఞానమున సర్వమును ముంచెత్తినది. గంగా యమునా తోయములచే నొక ప్రయాగమాత్రము పునీతమయ్యెనుగాని యీ శ్రీరామకృష్ణ వివేకానంద స్రోతం సమ్మేళనముచే సర్వ ప్రపంచము పవిత్రమై యొప్పారెను.

మరల తృతీయ సందర్భమున నరేంద్రుఁ డరుదెంచు సమయమున గురుదేవుఁడు ఏకాంతమున సమాధిస్థితుఁడై

యుండెను. నరేంద్రుడు దగ్గర కేతెంపగనే శ్రీరామకృష్ణు డా బాలకు వక్షమును దన పాదపద్మమున దాకెను. వెంటనే సర్వ చరాచర ప్రపంచము చక్రమురీతి దిరుగుచున్నటుల నరేంద్రునకు గోచరింప 'మీరేమి చేయుచున్నారు? నాకు తల్లి దండ్రులు గలరు సుమా' అని బిగ్గరగా నతడు భయమున నరచెను. అంత శ్రీరామకృష్ణుడు చిరునగవున దన శిష్యుని మరల స్పృశింప నరేంద్రునకు బాహ్యస్మృతి గల్గెను. కాని నరేంద్రుడు దాని నైజమును గ్రహింపనివాడగుటచే నావిషయమును బలుమారు దలంచి, యిది గారడియై యుండుననియు, నిట్టి శక్తులవలన ప్రయోజన మావంతయు లేదనియు జింతించి వెడలెను. ఇట్లు దర్వాత సమాగమమున, నరేంద్రుని శ్రీరామకృష్ణుడు శిరమున స్పృశింప, నరేంద్రుడు బాహ్యస్మృతి గోల్పోయి సమాధి నిమగ్నుడయ్యెను. ఆ సమయమున శ్రీరామకృష్ణుడు నరేంద్రుని పూర్వజన్మ విషయముల ననేకము ప్రశ్నించి, ప్రత్యుత్తరముల నొంది నరేంద్రునిగూర్చి తన భావముల రూఢిపరచికొనెను. నరేంద్రు డాస్థితిలో అద్వితీయమైన నొక అవ్యయానందమును బొంది, బాహ్యస్మృతిగలిగిన వెంటనే మరల యాస్థితికై యారాటపడెను. అవును, దర్శన స్పర్శన భావనములతోడ యితరుల హృదయగత భావములను, పూర్వజన్మ వృత్తాంతములనేగాక, భూత భవిష్య ద్వర్తమానములగల జీవిత విశేషముల మహాత్ములు గ్రహింతురుగదా! తపోసంపన్నులకు సాధ్యము కాని దేది?

పైవిధాన నరేంద్రుడు శ్రీరామకృష్ణ స్వామిమహిమను జవి జూచినవాడై, నతని మహావ్యక్తిగ విశ్వసించుచు, నతని

వైదముల బరిశీలించుచు, ఉపదేశముల నాలకించుచు, దరచు నతని సన్నిధానభాగ్యము నొందుచుండెను. శ్రీరామకృష్ణుడు, నరేంద్రుడు ప్రపంచోద్ధారకుడుగను, దన యడుగు జాడల ననుసరించి మానవ కళ్యాణ ప్రదాతయై ఆత్మజ్ఞానియై ప్రకాశించునని గ్రహించి, అతని అధిక ప్రేమతో జూచుచుండెను. నరేంద్రుడు శివస్వరూపుడనియు, అతనిలో మహాపురుష లక్షణములు అరువదితొమ్మిది గలవనియు, నితరులు ఒకటి రెండు లక్షణములకే మహాపురుషులగుదురు, కాన ఇతని ఆధ్యాత్మిక జ్యోతిముందు యితరులు దీపికలుమాత్రమే యనియు గ్రహించి, నరేంద్రుని శ్రీరామకృష్ణుడు ప్రత్యేక గౌరవస్థానమున నుంచెడివాడు. శ్రీరామకృష్ణదేవుడు కాళికారాధనా తత్పరుడై తన కనేకవిధముల ఆదర్శముగనున్నను, నరేంద్రుడు విగ్రహారాధనమునకు సమ్మతుడు కాజాలడయ్యెను. అంతియగాక 'మీవద్ద కేతెంచిన వార తెల్లరు కాళిక నంగీకరింప నవసరము లేదు' అనియు శ్రీరామకృష్ణునితో నత డనెడివాడు. కాని అందులకు శ్రీరామకృష్ణుని సమాధానముమాత్రము ప్రేమపూరిత మందహాసమే. నరేంద్రుడు ఆజగజ్జనని నంగీకరించు దినములు ముందు రాగలవని గ్రహించియున్న శ్రీరామకృష్ణుడు శాంతమున నుండును. మాతృప్రేమకు మించిన శ్రీరామకృష్ణుని యసాధారణ ప్రేమకు నరేంద్రనాథుడు దాసోహమ్మని వశుడై పోయెను.

ఒకదినమున నరేంద్రుడు అద్వైత సిద్ధాంతమును అపహాసించుచు, దన సహచరులగు రాఖలు, లాటు, కాళి మొదలగు బాలకులతో 'సర్వము బ్రహ్మము, యీ కూజా

బ్రహ్మము, యీ బల్ల బ్రహ్మము, మనముకూడా బ్రహ్మమే' అని పలుకుచుండ, శ్రీరామకృష్ణు డద్దాని నాకర్ణించి నగుచు, నాతనిజేరి కరమున స్పృశించి సమాధినొందెను. అంత నరేంద్రునకు సర్వజగము బ్రహ్మముగనే గోచరింపజొచ్చెను. ఇంటికి జేరినను, గృహము బ్రహ్మముగను, భోజ్యములు బ్రహ్మముగను, తల్లియు బ్రహ్మముగను, సర్వము బ్రహ్మమై పొడగట్టెను. అట్లు కొన్ని దినముల యనంతరము శ్రీరామకృష్ణుని అనుగ్రహ విశేషమున సామాన్యస్థితికి నరేంద్రుడు రాగల్గెను. అంత నద్వైతతత్త్వము నామూలాగ్రము అనుభవరూపమున గ్రహింపజేసిన శ్రీరామకృష్ణదేవుని యందు నధికతర భక్తితో నరేంద్రుడు మెలగ గడంగెను. అసంఖ్యాక గ్రంథముల బఠించినను, రచించినను సంభవముకాని అద్వైతభావము ఒక గుర్వనుగ్రహ విశేషముచేత నెంత సులభముగ నరేంద్రునకు సంప్రాప్తించెనో గాంచుడు. అందుచేతనే 'దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనం। దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥' విషయత్యాగమును, తత్త్వదర్శనమును, సహజావస్థయు నను నీ త్రయము సద్గురు కటాక్షము వినా దుర్లభమని వరాహోపనిషత్తు వాక్రుచ్చుచున్నది. 'నాస్తి తత్త్వం గురోః పరం' గురువుకంటె బరమైన తత్త్వము లేదని శాస్త్రవాక్యము.

గీటుచే సువర్ణముయొక్క కాంతి బయల్పడునటుల, ధూళిధూసరితమగు నద్దమును దుడిచిన నందలి ప్రతిబింబము ప్రస్ఫుటమై యొప్పువిధానమున, చందనపుజెక్కను అరుగదీసినగొలదియు దాని సువాసన మధికమై యొప్పుచందమున,

గురువరేణ్యుని బరీక్షచే శిష్యుల అధిక్యతయు వన్నె కెక్కును. ఆవిధమున నరేంద్రు బరీక్షించు నుద్దేశ్యమున శ్రీరామ కృష్ణుడు నరేంద్రునితో నొక మాసము సంభాషింపకుండు టయేగాక అతని గన్నెత్తియైన గాంచడయ్యెను. అయినను నరేంద్రుడు చలింపక బ్రతిదినమును శ్రీగురుదేవుని సన్నిధి కేతెంచుచునే యుండెను. ఇట్టి కఠినపరీక్షకు దన ముఖ్య శిష్యుడు తట్టుకొన గల్గుటచే శ్రీరామకృష్ణుని యానందమునకు మేరయే లేదు. రాగవిరాగములు మహాత్ముల వశముగదా!

గురువు శిష్యునట్లు పరీక్షించుచుండ, శిష్యుడుగూడ గురుని బరీక్షింప గడంగెను. 'వర్తకుడు నాణెమును బ్రయోగించి దాని మంచి చెడ్డల నరయు విధానమున, గురువు ననుసరింప నిశ్చయించుకొను బూర్వము వాని బరీక్షింపవలయు' నని శ్రీరామకృష్ణుడు తరచు బలుకుచుండును. అందుచే నొకదినము శ్రీరామకృష్ణుడు గదిలో లేని సమయమున నరేంద్రుడు ఒక రూప్యమును గురువరు మంచముపై నుంచెను. శ్రీరామకృష్ణుడు కొంతతడవున కరుదెంచి, మంచముపై నాసీనుడుకాగా, నత నికి దేలుకుట్టిన చందము మిగుల బాధగలిగి, శిష్యుల బిలిచి ప్రక్కను విదిలింప నాజ్ఞ నిడెను. అంత నాపాన్పునుండి నాణెము క్రిందపడెను. వెంటనే సర్వజ్ఞుడైన శ్రీరామకృష్ణు డద్దాని గ్రహించి, నరేంద్రుడు తనను బరీక్షించి నందులకు గోపగింపక నానందించి మెచ్చుకొనెను. అచ్చటనేగల నరేంద్రుడు శ్రీరామకృష్ణుని కాంచన జయమును గండ్లారగాంచి ఆశ్చర్య మును బొందెను. కామకాంచన విజయుండును, జితేంద్రి యుడునుగదా శ్రీరామకృష్ణదేవుడు!

ఇట్లు సద్గురుదేవుని సన్నిధిని మనుచు,ననేక సాధనల నొనరించుచు, 'శ్రావ్యం సదా కిం ? గురువేదవాక్యం' శ్రావ్యమైన దెద్ది ? యన గురు వేద వాక్యములే యను మణిరత్నమాల వాక్యసరణి, శ్రీరామకృష్ణుని యుపదేశముల నాలకించి ఆచరించుచు, భగవత్ప్రాప్తి త్వరలో గలుగవలయునను తీవ్ర సంకల్పమున, సిద్ధు లనేకములు గలుగుచున్నను వాని గణింపక నరేంద్రుడు సాధనానిమగ్నుడై యుండెను. ఎంత భగవదావేదన యతని హృదయమును దహించుచుండెనో, సిద్ధులయం దతని కెంత నిస్పృహయో ఒకవిషయమున గ్రహింపనగును. శ్రీరామకృష్ణు డొకపర్యాయము శిష్యుని యాధ్యాత్మికాసక్తియొక్క తీవ్రత బరిక్షించుటకో యన 'నరేన్, నా తపోమహిమచే ననేక సిద్ధులు నా హస్తగతము. వాని నీకొసంగ నా అభిమతము' అని తెలిపెను. వెంటనే నరేంద్రుడు 'వానివలన భగవదనుభూతి ప్రాపిలునా ?' యని ప్రశ్నింప, 'లేదు' అని గురుదేవుడు వచించెను. 'అట్లయిన అవి నాకు ఎందులకు? నాకు భగవంతుని అనుభూతియే యవసరము. ఆపిమ్మట నీసిద్ధుల విషయమై యోచింపగలను' అని నరేంద్రుడు యీశ్వర దర్శనమే తన పరమాకాంక్ష యను విషయమును వ్యక్తముజేసి యల్పసిద్ధుల ద్యజించెను. అవును, రూప్యము విలువ నెరెంగినవాడు చిల్లి కానికై ఆశనొందునా? శాశ్వతమును, నిత్యమును, సత్యమును, భవభయ నాశకారియు నగు భగవంతుని విలువ గ్రహించిన నరేంద్రునాథు డెట్టులీ క్షణికములగు ప్రాపంచిక సుఖములను, సిద్ధుల నాశించును? వీనిపై నిజముగా దృష్టియేయున్నచో నరేంద్రు డెట్లు వివేకానందుడై వెలుగొందును?

శ్రీరామకృష్ణ గురుదేవుడు శిష్యుల యభివృద్ధి కనుగుణముగ నుపదేశముల గావించెడివాడు. 'నరేన్, పవిత్ర బ్రహ్మచర్యమును, ద్వాదశవర్షములు పాటించినచో దానవమానుష శక్తిలభ్యము. మరియు దానిచే ప్రజ్ఞానైపుణ్యమును, సూక్ష్మవిషయ గ్రహణ శక్తియు గలుగును. అసలు బ్రహ్మచర్య వ్రత పవిత్రతచేతనే ఆధాత్మిక మార్గము సులభమైయుండునుసుమా! అట్టివానికి ముక్తి వశమైయుండును. అట్టి బ్రహ్మచర్యమును నీవుగూడ వరించి, ఆధ్యాత్మిక శిఖరము నధిష్ఠించి, ఆ యనుభవసంపదల మున్గి సర్వప్రపంచమునకు జాటుము' అని శ్రీరామకృష్ణుడు బ్రహ్మచర్య వ్రతదీక్షా ప్రాధాన్యమును సప్రేమమున నమానుషమును, దివ్యమును నగు పరమోపదేశమును నరేంద్రునకు గావించెను. ఆమహోపదేశమును అక్షరశః అనుసరించియేగదా నరేంద్రుడు యతివరేణ్యుడై, జగద్గురువై, వివేకానందుడై పరిణమించి మించెను?

## పరీక్షాకాలము

పై విధాన, శ్రీ రామకృష్ణ సన్నిధానమున నెట్టి సాంసారిక బాధ్యతలును లేక నాధ్యాత్మిక వియద్విహారానంద డోలికల నూగుచున్న నరేంద్రనాథునకు దీనుల కష్టముల దెలియ జేయుటకో యనునట్లు, పరమేశ్వర సంకల్పముచే, 1884 వ సంవత్సరమున నతడు బి. యే. పరీక్షయం దుత్తీర్ణత బొందిన పిమ్మట నతని జనకుడగు విశ్వనాథుడు గుండెజబ్బుచే

నకస్మాత్తుగ మరణించెను. అందుచే నిక కుటుంబభారము మోయవలసిన నరేంద్రుడు విద్యకు స్వస్తిచెప్పి యుద్యోగ మునకై తిరుగాడజొచ్చెను. సర్వసంపదలతో దులదూగి, బంధు మిత్రాదుల కండగనుండి యుండియు విశ్వనాధుడు మరణించిన పిమ్మట, బంధువులెల్లరు వైదొలగిరి. పూర్వము విశ్వనాధునిచే బోషింపబడియుండియు నేడు ఆ కుటుంబ కష్టముల వారు విచారింపరైరి! బెల్లమున్న జీమలు చేరునట్లు సంపదయున్న గదా బంధుమిత్రాదుల యాగమనము! అందుచేత 'ధనమూల మిదం జగత్' అను ఆర్యోక్తి గలిగెను. ఈ విషయమును భర్తృహరి ప్రస్తావించుచు 'యస్యాస్తి విత్తం స నరః కులీనః స పండితః స శ్రుతవాన్ గుణజ్ఞః। స ఏవ వక్తా స చ దర్శ నీయః సర్వే గుణాః కాంచనమాశ్రయంతి॥' ఎవని కైశ్వర్యము గలదో వాడే మానవుడు, సత్కులోద్భవుడు, బుద్ధిమంతుడు, శాస్త్రజ్ఞుడు, వక్త, యోగ్యుడు. కాన సమస్తగుణములు కాంచనముగలవాని నాశ్రయించి యున్నవని వివరించెను. అనగా ననేకరీతుల నెల్ల రాశ్రయింతురు. అట్లు పూర్వము ఆశ్రయించిన వారు నేడు విడనాడుటచే విశ్వనాధుని ప్రభు వంశమగు దత్తకుటుంబము నేడు అనేక యిడుములకు లోన య్యెను. కాని యీ కష్టములకు నరేంద్రనాధుడు లొంగక, గురుదేవుని వీడక ప్రవర్తించుచుండెను. 'హర్షస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ। దివసే దివసే మూఢ మావిశంతి న పండితం॥' ప్రతిదినము మూఢుని సహస్ర సంతోష స్థానము లును శతభయస్థానములును ఆవరించును. కాని పండితవరేణ్యుని అనగా 'పండా ఆత్మవిషయా బుద్ధిర్యేషాం తే హి పండితాః' అను

గీతా భాష్య వచనము పగిది ఆత్మ విషయకమైన బుద్ధి యుక్తుడగు బండితుని సమీపింపనేరవని శాస్త్రము ఆదేశించుచున్నది గదా! అట్టి ఆత్మవిషయిక బుద్ధి సంపన్నుడగుటచే మన నరేంద్రుడు కష్టకాలములు పరీక్షాసమయము లని భావనజేసె నేమో! ఉద్యోగమునకై యీ విధముగ నతడు దిరుగు చున్నను, సందర్భములు తనకు వ్యతిరేకముగ నున్నను, వీని కెక్కుడు ప్రాధాన్యత నొసంగక, సాధనల సక్రమరీతి పట్టు దలను వీడక, సాగించుచునే యుండెను.

ఈ పరిస్థితుల కొకదినము విసివి వాని సరిజేయ నతడు శ్రీ రామకృష్ణు నర్థించెను. అందులకు శ్రీ రామకృష్ణుడు 'జగజ్జననియు, లోక సృష్టి స్థితి సంహారిణియు నగు దక్షిణేశ్వరిని ప్రార్థింపు' మని యానతీయ, నంతవరకు విగ్రహారాధనను నిరసించుచున్నను, మంత్రగానికడ సర్పము వశమగునట్లు గురు వచనానుసరణి నరేంద్రుడు ఆలయమునకేగి, కాళికకెదుట ముకుళితహస్తుడై, అసలు విషయమును మరచి 'అమ్మా, భక్తి జ్ఞానముల నొసంగు' మని ప్రార్థించి వచ్చిన, వలసినవిషయము నర్థింపకుండుటచే శ్రీ రామకృష్ణునిచే ప్రేరేపింపబడి, మరల రెండు పర్యాయములరిగియు, మరల భక్తి జ్ఞానములనే గోరి నరేంద్రుడు తిరిగివచ్చెను. ఏమది? ఆశ్చర్యముగదా! అవును. మనోవాక్కాయ కర్మల నొకటే చేయుదురుగదా మహాత్ములు? భావన వచన ఆచరణములు వ్యత్యస్తముగనుండుట గాదుగదా వారి స్వభావము? అందుచే భగవంతునకు గాక యితరమునకు స్థానమీయని నరేంద్ర హృదయము యిహ సుఖముల నెట్లు అర్థింపగలదు? చిన్ననాటనుండియు త్యాగమే

హృదయమున ప్రవహింప 'క్షణం విత్తం క్షణం జీవితం' అను నట్లు యీ సర్వమును అనిత్యముగ, నసారముగ, హేయముగ భావించుచు, ధనమూలమున వాటిల్లు సర్వానర్థముల గ్రహించుచు, 'విహాయ వైరిణం కామ మర్థం చానర్థ సంకులం।' అను అష్టావక్రగీతోక్తి ననుసరించి కామ శత్రువును, అనర్థ మూలమగు ధనమును ద్యజించి, బ్రహ్మానుభూతి లీనమై, జనన మరణ విదూరమును, నిత్యానందపదము నిచ్ఛగించి, త్యాగ సామ్రాట్ అనదగు శ్రీ రామకృష్ణుని పదముల మోకరిల్లిన మన నరేంద్రుడు లోకైకమాతయగు కాళికామాయిని ధన రాసుల నిమ్మని ప్రార్థించుటయా? ఆ పలుకు లెట్లు నరేంద్రుని ముఖతః వెలువడగలవు? నరేంద్రుడే అట్లుగోరినచో సకలానుభవకోటి జవిజూచిన ఆధ్యాత్మిక శక్తి నిలయమగు శ్రీ రామకృష్ణుని జేరు టెట్లగును? జగన్మాతృ కార్యము లెట్లు కొనసాగును? ఆ ప్రపంచోద్ధరణ కార్యమునకు గంకణహస్తుడై దీక్ష వహించు టెట్లగును? విద్యా వివేక త్యాగ త్రయముచే మూర్తీభవించిన వివేకానంద స్వామియై శ్రీరామకృష్ణదేవుని ఉపదేశ సారముల సర్వప్రపంచమున వెదజల్లి కీర్తిప్రతిష్ఠల నెట్లు పొందనగును? ఇట్టి విరాగసంపన్న హృదయుడు కావుననే సన్న్యసించి వివేకానందస్వామియై, మహారాజాధిరాజులుగూడ పాదాక్రాంతులైనను, అంతఃపురముల దా నివసించుచున్నను, బాశ్చాత్యఖండముల బర్యటించుచు, గోటీశ్వరుల మందిరముల హంసతూలికాతల్పముల దా శయనించుచున్నను నతని వైరాగ్యమెట్టి కళంకమునుబొందక నధిక తేజో విరాజితమైనది. ఆ ధనాశయే నాతని హృదయమున నుండిన ఆతడు శ్రీరామకృష్ణుని

శిష్యాగ్రేసరుడగునా? ఆతడు వివేకాధిగాధుడగు వివేకానందుడై సర్వప్రపంచముచే జోహారుల నందుకొనునా ? ఈ విధముగ సర్వవిషయాతీతమై, నరేంద్రనాథుని చిత్తము సద్గురు సన్నిధానమున దీవ్రముగ సాధనాయత్తము నొందుచు, ననుభవ సంపదను గడించుచు, భావి మహాజీవిత సౌధమునకు సుస్థిరమైన పునాదుల నిర్మాణమున దినములు గడుపుచుండెను.

## సద్గురు మహాసమాధి

అంత గొంత కాలమునకు ఒక్క నరేంద్రునికే గాక, నింక ననేక భక్తుల ఆధ్యాత్మిక జీవిత వికాసమునకు ఆధారభూతుడై, అనవరతము గృపిసల్పుచున్న శ్రీ రామకృష్ణ గురుదేవునికి గంఠమున నొక దుష్ట వ్రణము జనించెను. కాన చికిత్స కొరకై శిష్యులు శ్రీ రామకృష్ణుని కలకత్తా సమీపమునగల కాశీపూర్‌నకు గొనివచ్చిరి. శ్రీ రామకృష్ణదేవుని సేవాభాగ్యమునకై కొందరు యువకులును, ధనికులును, ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరులును అగు భక్తకోటి వెంటనేయుండి తగు చికిత్స జేయించుచుండిరి. నరేంద్రనాథుడుగూడ విద్యల వర్జించి, శ్రీగురు సన్నిధినే యుండుచు, సహచరుల కనేక విషయముల బోధించుచు, సాధనల తాను జేయుచు, వారిచే జేయించుచు, శ్రీరామకృష్ణునికి సర్వవసతుల గావించుచు నుండెను. శ్రీరామకృష్ణుని వ్యాధి అధికతరమైన కాలదిని గురు అనుగ్రహమున నిర్వికల్పసమాధిని జవి జూడవలయు నని నరేంద్రునకు దీవ్ర సంకల్ప ముదయించి, గురుదేవు నర్థించెను. సకల ప్రపంచ

మును దరింప జేయునట్టి నరేంద్రుని కేవలము నిర్వికల్పమున నుంచుటకు యిష్టములేకున్నను, నిర్వికల్పమును అనుభవించుటగూడ యతని కవసరమగుటచే, గొలదిగ దాని రుచి జూపింప శ్రీరామకృష్ణుడు సంకల్పించెను. అందుచే నొకదినము నిశీధి నరేంద్రు డకస్మాత్తుగ నిర్వికల్పమును బొంది యానందించెను. మరల దన తర్వాత ప్రపంచోద్ధరణ భారమును వహింపవలసినవాడు నరేంద్రుడని శ్రీరామకృష్ణదేవుడు ఒకనాడు అతని జేరబిలిచి, సమాధిస్థిత చిత్తముతో నరేంద్రునికి దన్మయత గలుగజేసి, తన యాధ్యాత్మిక శక్తుల నన్నింటిని నతనికి అర్పించెను. శిష్యులగూడ నొక్కొక్కర నరేంద్రునికే యొప్పగించి, భక్తుల యాధ్యాత్మిక పురోగమన నిర్వహణ భారమునుగూడ నరేంద్రుని హస్తముల శ్రీరామకృష్ణదేవుడు పెట్టెను. ఇట్లు సర్వకార్యభారముల నరేంద్రునకు ఒప్పగించి, శిష్యుల కమూల్యమగు అనుభవకోటిని గల్పతరుచందము ప్రసాదించి, వారి ముకుళితాధ్యాత్మిక పద్మరాజముల వికసిత మొనర్చిన శ్రీరామకృష్ణభగవానుడు, సర్వసాధక లోకమును దుఃఖసాగరమున ముంచి, 1886 ఆగస్టు 16వ తేది సంకుచితమును, రోగజరామయమును, అగు దేహమును వీడి నిరావరణ పరబ్రహ్మచైతన్యమునం దైక్యము నొందెను.

## సన్న్యాస స్వీకారము

సర్వాధ్యాత్మిక పెన్నిధియగు నట్టి గురుదేవుని బాసిన భక్తబృందమున, సద్గురు వియోగబాధా భారమున, నరేం

ద్రుని నాయకత్వమున, రాఖలు, కాళి, లాటు, శశి, శరత్ నిరంజన్, గంగాధర్, యోగేంద్ర, తారక్, బాబూరాం, హరిప్రసన్న, తులసీచరణ, మొదలగు యువకులు త్యాగధనుడగు శ్రీరామకృష్ణుని సన్నిధి మెలగుటచేతను, యీయువకుల సంస్కారములు పవిత్రమగుటచేతను, విషయసుఖముల రోసి, తమ గృహములబాసి, బారానగరుసందుగల నొక శిథిల గృహమున నివసించుచు, దీవ్రసాధనలచే గాలము గడుపజొచ్చిరి. 'పుత్ర మిత్ర కళత్రాది సుఖం జన్మని జన్మని। మర్త్యత్వం పురుషత్వం చ వివేకశ్చ న లభ్యతే॥'అను శంకర రచిత సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహ వచనచందమున పుత్ర మిత్ర కళత్రాది సుఖము ప్రతి జన్మమునను లభ్యమగునుగాని మానుషత్వము, పురుషత్వము, వివేకమును ప్రాప్తింపవు. ఆ మూడులక్షణములును త్రివేణివలె నాత్యాగులలో సంతర్గతమైయుండుట చేతనేగదా, వా రమానుష శక్తిని గడించి, సర్వ ప్రపంచమున కాత్మానందమును బంచియిడగల శక్తిసామర్థ్యములుగల సన్న్యాసులై కాలాంతరమున వెలుగొందిరి! దానికై నరేంద్రుడు వారికి నాయకుడై ధైర్యసాహసముల బ్రోత్సహించుచు, సాధనలదా నిమగ్నత బొందుచు సర్వతోముఖానుభవముల నార్జించుచుండెను. ధ్యాననిమగ్నత పవిత్రహృదయులకే సాధ్యము. కాన జన్మసిద్ధుడగు నరేంద్రున కసాధ్యమెద్ది ? చిరుప్రాయమునసే నరేంద్రుడు ధ్యానముననున్న నొకదినమున బుద్ధభగవానుడు ప్రత్యక్షమయ్యెను. మరల నపరబుద్ధుడై రూపొందుచున్న నరేంద్రునికి ధ్యానస్థితి సహజ లక్షణముగదా ! తరచు ధ్యానస్థితులు అతనికి దీవ్రమై శరీరవిస్మృతి గల్గెడిది. అట్లు

సోదరులకు ధ్యానాదుల శిక్షణ మొనరించుటయేగాక, అనేక తత్త్వశాస్త్రముల చక్కగా వారికి బోధించుచు సన్న్యాస ధర్మముల నుపదేశించుచు, నన్నపానాదుల మరచి తన్మయత్వ మున గాలము గడుపుచుండెను. యువకుల తలిదండ్రులు వీరి పట్టుదలను సాధనాదులను దిలకించి, వీరిక ప్రపంచమున కనుప రాగనే యని దీర్మానించుకొని, నరేంద్రుడే దీనికి గారణ మని యతని నిందించుచు, ప్రయోజనము లేకుండుటచే నిరాస జనించి యూరకుండిరి. ఆ పట్టుదలయేగదా వారి నుత్తమ సన్న్యాసశ్రేణిలో జేర్చినది!

వైరాగ్య సన్న్యాసములన నంత సులభసాధ్యముకాదు. అసలు 'ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా' యీశ్వరానుగ్రహమాత్రమున బురుషులకు అద్వైతవాసన లభించునని శాస్త్రము. అట్లు చేకూరిన నా యద్వైతవాసనాభి వృద్ధిచే సకలాద్వైతానుభూతుల గడింప, నా యద్వైత శిఖర మధిరోహింప విషయ విముఖత్వ మేర్పడవలయును. 'ముక్తి మిచ్ఛసిచే త్తాత విషయా న్విషవత్త్యజ' అను అష్టావక్రగీతాను సారముగ ముక్తి నిచ్ఛగించిన విషయముల విషతుల్యముగ ద్యజింపవలయును. అంతియకాక 'కే శత్రవః సంతి? నిజేంద్రి యాణి! తాన్యేవ మిత్రాణి జితాని కాని!' శత్రువు లెవ్వరనిన నిజేంద్రియములనియు, ఆ యింద్రియములే నిగ్రహింపబడిన మిత్రులనియు వచించురీతి యింద్రియనిగ్రహ మలవడవలయును. మరియు 'బ్రహ్మాది స్థావరాంతేషు వైరాగ్యం విషయేష్వను। యథైవ కాక విష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలం॥' కాకి మలమునువలె ఆ బ్రహ్మస్తంబ పర్యంత విషయముల సేవగించు

వానిదే నిర్మలమును యథార్థమునునైన వైరాగ్యముగా అపరో
క్షానుభూతి కథనము. అట్టి పరమ వైరాగ్యనిధియై 'యావ
త్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే' సర్వమును
త్యజింపనంతదనుక నాత్మయు నలభ్యమే యను ఉపనిషత్తాత్ప
ర్యముమాడ్కి త్యాగియై, యత్యాశ్రమ స్వీకరణ మొనర్చి 'జ్ఞానం
వినా మోక్షో న సిధ్యతి' జ్ఞానమువినా మోక్షము సిద్ధింపదని
గ్రహించి, దాని స్వాధీన మొనర్చికొని, జ్ఞానఘనియై, 'న స పున
రావర్తతే' అను శ్రుతిపగిది శాశ్వదానంద పరబ్రహ్మమున
సాధకుడు లయముగాంచును. కర్మాచరణముచే మోక్షము
సాధ్యముగాదనియు, 'కర్మణా కేచిదిచ్ఛంతి కైవల్యంమునిసత్తమ।
తే మూఢాః' ఆకైవల్యపదవిని గొందరు కర్మకాండచే బొంద
వలయునని వాంఛింతురు. వారు మూఢలనియు గ్రహించి
జ్ఞానము నార్జించుటకే ఆయత్తమగును. కాన యిట్లు సర్వము
సాధింప ఎట్టి స్థిరమగు జిత్తమును, నిర్భయత్వ ధీరత్వ విశ్వా
సము లుండవలయునో గ్రహింపుడు. ఇన్ని లక్షణములు కలిగిన
కదా సన్న్యాసాశ్రమ గౌరవమును గాపాడుట! అట్లుగాక
'ద్రవ్యార్థ మన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థ మేవ చ। సన్న్యసే
దుభయ భ్రష్ట స్స ముక్తిం నాప్నుమర్హతి॥' ద్రవ్య, భోజన,
వస్త్ర, ప్రతిష్ఠాదులకై ఎవ్వడు సన్న్యసించునో వా డుభయ
భ్రష్టుడై ముక్తిని బొందుట కనర్హుడని పరమహంస పరివ్రాజకో
పనిషత్తు నొక్కి వక్కాణించియున్నది. 'వమనాహారవత్ యస్య
భాతి సర్వేషణాదిషు। తస్యాధికార స్సన్న్యసే త్యక్త దేహాభి
మానినః॥' దేహాభిమానరహితుడై, వమనపదార్థమువలె సర్వే
షణముల గాంచువానికే సన్న్యాసాధికారముగలదని శ్రుతి

స్మృతి పురాణాదులన్నియు నిశ్చయించియున్నవి. సన్న్యాస మన కాషాయవలువల ధరించుటగాదు. 'అహంకార మమకార త్యాగ ఏవ సన్న్యాసో వక్ష్యతే। నాశేష శాస్త్రార్థ త్యాగః' అను మేధాతిథి తాత్పర్యవిధాన నహంకారముల ద్రోయుట సన్న్యాసముగాని శాస్త్రార్థముల ద్యజించుటకాదు.

## పరివ్రాజకము

ఇట్లు తపోనిమగ్నులై వారు కాలము గడుపుచుండ, గొంతకాలమునకు నరేంద్రుడు పరివ్రాజకజీవిత మవలంబింప దలచి, సోదర శిష్యులచే విరజాది హోమ కార్యములజేయించి, శాస్త్రోక్తరీతి యత్యాశ్రమ ప్రవేశ మొనరింపజేసి అందరికి నూతన నామధేయముల నొసంగెను. నూత్నభావముల కలిగి, సర్వకాలముల నూతనమగు నాత్మాను సంధానమొనర్చి, నూతన చైతన్యమున సకల ప్రపంచమును ముంచెత్తి, నూత నాదర్శగామి యగుటకే పూర్వపు నామమును బరిత్యజించి నూతన నామధేయమును స్వీకరించుట యందలి అంతరార్థ మేమో! అదే విధముగ దానుగూడ యాచరించెను. దీనివలన బూర్వము శ్రీరామకృష్ణదేవుడు వీరి కొసంగియున్న కాషాయ వస్త్రములు శాస్త్రీయ విధానమునగూడ యీ యువకుల మేనుల నలంకరించిన వయ్యెను. శ్రీ రామకృష్ణదేవుని ప్రథమ శిష్యుడు తా నగుటచే గురువరు నామము ననుసంధాన మొనర్చి తన సన్న్యాసనామమును బెట్టుకొననెంచిన నరేం ద్రునకు ముందుగ, శశి రామకృష్ణానంద నామమును గోరుటచే

నరేంద్రు డే నామమును వహింపక, బుణ్యక్షేత్రముల గ్రుమ్మర సాగెను. అట్లగుచో నీ వివేకానంద నామము ఎట్లు ఏర్పడెనని చదువరులు ప్రశ్నింపవచ్చును. నరేంద్రుడు పరివ్రాజక జీవితమున నొకొక్కచోట నొకొక్క నామధారియై తిరుగుచు నెవ్వరును గుర్తింపకుండునట్లుండెను. కాని యిత డమెరికా ఖండమున కరుగ సంసిద్ధముకాగ, శిష్యుడైన క్షేత్రీమహారాజు స్వామిని బిలిచి Pass Port ప్యాస్‌పోర్టులో నామము వ్రాయవలయునుగాన నేమి పేరు వ్రాయుటయో స్వాములవారి బ్రశ్నించెను. అంత, నంతవరకు నేదియు స్పష్టమైన నామము తనకు లేకుండుటచే 'మీ యిష్టము' అని స్వాములవారు నుడివిరి. కాన నామహారాజు యోచించి, స్వాములవారి వివేకమునకు ఆశ్చర్యానంద మాసుడై యుండుటచే, వివేకములో నానందించువాడుగ వివేకానందస్వామి యని నామమిడెను. ఆనామమే సార్థకమై వివేకమున కధినాథుడు వివేకానంద స్వామి యనురీతి సకల ప్రపంచము మారుమ్రోగెను. ఆ నామమును స్వామి కిడుట క్షేత్రీమహారాజగు అజిత్సింగు యొక్క అదృష్టముగదా! కాన నంతవరకు నూరూర బేర్లను మార్చుకొనుచున్న మన వివేకానందుడు ఏ ఏ స్థలముల గ్రుమ్మరెనో, ఏయే కష్టముల ననుభవించెనో, మొదలగు పరివ్రాజక జీవిత విశేషములు గొంచెము గ్రహింతము. సన్న్యాసి యనువాడు యీ విధముగ దేశమును బర్యటన మొనరించినగాని 'పరమహంస పరివ్రాజకాచార్య' అను బిరుదు గలుగజాలదు.

ఇటనుండి నరేంద్రుడు వివేకానందుడై యుండుటచే వివేకానంద నామమునే యుపయోగింతము. ఆశ్రమ వ్యవస్థ మారుటచే నిక బూర్వాశ్రమ నామము అనుపయుక్తము. సన్న్యాస స్వీకరణము గావించిన మన వివేకానందుడు, కలకత్తలోని సోదర శిష్య సముదాయమును వీడి, పుణ్యక్షేత్రములలో నగ్రగణ్యమని కీర్తిగాంచినదియు, మరియు బండిత ప్రకాండుల కాలవాలమును, సర్వవిద్యా సంశోభితమును, అసంఖ్యాక యతిరాజుల కాశ్రయమును, బవిత్ర గంగా స్రవంతీ జల ప్రావృతమును, అగు వారణాసీ నగరమును దర్శించెను. అట దినదినమును విశ్వేశ్వరు సన్నిధానమున తన్మయత్వమున మునిగియుండెడివాడు. అచట ననేక విద్వాంసుల దర్శించెను. దిగంబరుడై 'సర్వం ఖల్విదం బ్రహ్మ'యను ఉపనిషద్వాక్యమురీతి సమస్తమున బ్రహ్మమును దిలకించు త్రిలింగస్వామి యను మహాపురుషునిగూడ నట వివేకానందుడు సందర్శించెను. మరియు, 'కామకాంచనాతీతు లెవరును లేరు' అని వితండముగ వాదించు భాస్కరానందుని వద్దకేగి 'మద్గురు వరేణ్యుడగు శ్రీ రామకృష్ణదేవు డొక్కడే అట్టి కామకాంచన విజయుడు' అని చాటి భాస్కరానందుని వాగ్బంధము గావించెను. మన వివేకానందుడు అట్లు కాశీనగరమున గొంత కాలము గడిపి, యటనుండి శ్రీ రామచంద్రమూర్తియొక్క జన్మస్థల మగు నయోధ్యను, అంత అపూర్వమును, సుప్రసిద్ధమును, అసమమును అగు తాజ్ మహాలు గల ఆగ్రానుదర్శించి, పిమ్మట శ్రీ కృష్ణభగవానుని ఆనంద కేళీరంగమగు బృందావనమునకు వివేకానందుడు జేరెను. అచ్చట గోవర్థనగిరి ప్రదక్షిణ

మునకై బయలుదేరి, అతడు అపరిగ్రహ దీక్షనుబూని 'చిక్కినదె తిండి మంచిదేన్ చెడ్డదేని' అనుచందము, నెవ్వరినిగూడ నాహారమునకై యర్థింపక వెడలుచుండెను. అంత గొంతకాలమునకు వెనుకనుండి అపరిచితుడొక డరుదెంచి, వివేకానందుని యాహ్వానించి యాహారమునిడి వస్త్రముల నొసంగెను.

ఇట్లే వివేకానందు డొకపర్యాయము రాజపుత్రస్థానమున బర్యటనము సేయుచుండెను. మంచి వేసవికాల మగుటచే నెండలు విపరీతమై జీవుల ప్రాణములదీయు మృత్యువుపగిది రూపొందెను. అట్టి సమయమున స్వామిజీ మట్టమధ్యాహ్నమున టారీఘాట్ యను నొక స్టేషనులో దిగి, దాహపీడితుడై యట్లే ఒక వృక్షచ్ఛాయ నాసీను డయ్యెను. ఆతని ముఖమున నెట్టి బాధయు జూపరులకు దోపదయ్యెను. మరియు మన వివేకానందునితోడ నింతవరకు బయనించుచు, సన్న్యాసుల యుత్కృష్టతను గ్రహింపజాలని యొక వణిక్ప్రముఖుడు ధనమదాంధతచే 'కాషాయగుడ్డల ధరించుటచే నూరక సర్వము లభించుననుకొందు రీ సన్న్యాసులు. వీరి నాదరించువా రెవరుందురు? సోమరితన మభివృద్ధిచెంద గాషాయాంబరముల దాల్చి దేశముల ద్రిమ్మరుచుందురు. తత్ఫలితముగ వీరిట్లు అన్నపానములు లేక కృశించిన బుద్ధి రాగలదు. వీరు ప్రపంచమున దేనికి బనికివత్తురు? చదువుసంధ్యలు, తెలివితేటలు పూజ్యము' అని బహువిధముల సన్న్యాసుల దూషించుచు నూరకుండెను. అయినను వివేకానందుడు నిర్వికారమున నుండెను, అవును. 'ధీరస్తు భోజ్యమానోపి పీడ్యమానోపి సర్వదా। ఆత్మానం కేవలం పశ్య న్న తుష్యతి న కుప్యతి॥'

అనునట్లు భుజించినను, బీడింపబడినను సర్వదా కేవల మాత్మానుసంధానుడైన ధీరుడుమాత్రము సంతసమును గాని క్రోధమునుగాని కాంచక ద్వంద్వాతీతుడై యొప్పునుగదా! అట్టి 'సుఖదుఃఖ స్సమ స్స్వస్థః' సుఖదుఃఖ సమత్వమును స్థిత ప్రజ్ఞలక్షణముగ గీతాకారుడగు శ్రీ కృష్ణపరమాత్మ నిర్వ చించెను.

అట్లు నిశ్చలముగ నుండిన మన వివేకానందుని సమీప మున కొక మిఠాయివర్తకుడు భోజనపదార్థములతో నరు దెంచి, సంప్రదాయానుగుణ్యముగ భక్తితో సాష్టాంగ నమ స్కృతిజేసి 'స్వామీ! ఈ పదార్థముల భుజించి నా కానంద మొనగూర్పుడు. నాకీ సదవకాశమును లభింపజేసిన నా భగవా నునికి నేనే మొసంగగలను? సత్పురుషుల సందర్శనము సులభ సాధ్యమా? ఈసంసారమునం దొకక్షణమైనను సత్సాంగత్యము లభించిన నది మానవులకు దాచుకొన్న ధనమువంటి దని గదా శాస్త్రము! పూర్వజన్మమున నే నెట్టి పుణ్యకార్యము నొనర్చి తినో! అందుచే నీ పుణ్యప్రదమగు అవకాశము నాకు భగవ దనుగ్రహముచే లభ్యమైనది' అని సంతోషమున స్వామిని భుజించుడని ప్రార్థించెను. కాని స్వామియో వానిపై దృష్టినిడక 'ఓయీ! నీవెవరికొరకిట కరుదెంచితివో! నన్నుగాంచి పొర బడుచుంటివేమో! నీవు భావించు వ్యక్తిని నేను గానుసుమా! మన కిరువురకును బరిచయమే లేదు. కాన వీని గొనిపొమ్ము' అని గంభీరవదనుడై బలికెను. అంత నాతడును 'స్వామీ! నిజమే. ఇతఃపూర్వము మనకు బరిచయములేదు. కాని యీ సమావేశము భగవత్సంకల్పమే. నేను మధ్యాహ్నము నిదు

రించుచుండ నా యిష్టదైవమగు శ్రీ రామచంద్రమూర్తి నాకు స్వప్నమున సాక్షాత్కరించి 'బిడ్డా! నీవింకను నిదురించుచుంటి వేమి! అట నా బిడ్డ క్షుత్పిపాసాకులితుడై అలమటించు చున్నాడు. కాన నీవు త్వరగ భోజనాదుల సిద్ధముజేసి తీసికొని వెడలుము. అశ్రద్ధవలదు. పొమ్మ్' అని ప్రబోధముచేయ, స్వప్నమేగదా యని నేనును అందలి యాథార్థ్యతను గుర్తె రుంగనేరక నిద్రాపరవశుడనై తిని. కాని నా ఆరాధ్య దేవత మరల నాకు దర్శనమిచ్చి, పై విధమున మరల వచించి, నన్ను నిద్ర నుండి మేల్కొలుప నేనును దత్తరపాటున మేల్కాంచి, త్వరిత గతి వీనిని గొని యిట కరుదెంచితిని. ఇది భగవదాజ్ఞయైయుండ మీరు వలదనుట భావ్యమా? వీనిని భుజించి యీ భక్తుని అనుగ్రహింపు'డని మరిమరి ప్రార్థించు ఆతని ప్రార్థనను మన్నించి, భగవానుడదృశ్యముగ దనయందెంత ప్రేమవాత్స ల్యముల జూపుచుండెనో యని ఆనందించి, శ్రీగురుదేవుని స్మరించి ఆ యాహారమును స్వీకరించెను. దీనినంతయు గాంచు చున్న నా వైశ్యుడు హృదయపరివర్తనమొంది, ఆ సత్పురుషుని దూషించినందులకు ఎంతయు వగచి, ఆయనకు బాదాక్రాంతుడై క్షమాపణమునర్థించెను. వివేకానందుడును నాతని సప్రేమమున లేవనెత్తి అభయమొసంగెను. అట్లు 'నైవ ప్రార్థయతే లాభం నాలాభే నానుశోచతి। ధీరస్య శీతలం చిత్తం అమృతేనైవ పూరితం॥' లాభమును వాంఛింపక, నష్టమునుగూర్చి శోకింపని ధీరునియొక్క శీతల చిత్తము అమృతముచేతనే పూరితమై యుండునుగదా!

ఇట్లు అనేకపర్యాయములు శ్రీ రామకృష్ణుని అదృశ్య హస్తము శిష్యుని క్షేమముల విచారించుచు రక్షించుచు నుండెను. 'యత్రైవ నివసేత్ దాన్తః తదారణ్యం తదా శ్రమం' సత్పురుషు లెందు వసింతురో అదియే అరణ్యము అదియే ఆశ్రమము అనిగదా మహాభారత వాక్యము. మహా పురుషుల కెందును ఎట్టి లోపమును గానరాదు. మన వివే కానందుని దివ్యజీవితమున నిట్టి ఘట్టము లసంఖ్యాకములు. అట్లుగ్ర తపోదృష్టి నట గొంతకాలముండి రాధాకుండును గూడ దర్శించి, మన వివేకానందుడు హరిద్వారమునకు బయలుదేరెను. మార్గమధ్యమున హాత్రాస్, రైల్వేస్టేషనులో ఆస్టేషన్ మాస్టరుచే నాహ్వానింపబడి అతని శిష్యునిగ స్వీక రించెను. శరచ్చంద్ర నామధేయుడైన యా స్టేషన్ మాష్టరు మన వివేకానందు ననుసరించి హృషీకేశమునకు జేరి, కొంత కాలమునకు వివేకానందునిదగ్గర సన్న్యాసాశ్రమ స్వీకారము జేసి, సదానందుడై ప్రఖ్యాతుడై యొప్పెను. అటనుండి మన వివేకానందుడు వైద్యనాథమునకు వచ్చుటతోడ గలకత్తలో గల సోదరశిష్యులలో నొకనికి ననారోగ్యముగనుండుటవిని, వారి యోగక్షేమముల గురుదేవుడు తనపైనిడి యుండుటచే వెంటనే ఆ సోదరు సేవజేయ గలకత్తకు వచ్చెను. సోదర శిష్యునికి స్వస్థత చేకూరిన వెంటనే ఘాజీపురమునగల ప్రఖ్యాత యోగి పవహారి బాబాను వివేకానందుడు దర్శించెను. పవహారిబాబా యొద్ద నాతడు యోగరహస్యముల గ్రహింపదలంచెను. కాని సర్వ రహస్యముల ననుభవించిన మన రామకృష్ణుడు ప్రత్య క్షమై యతని బుద్ధిని మరల్చెను. అంత నటనుండి కాశీనగర

మున వ్యాధిగ్రస్థుడైయున్న అభేదానందుని జేరి, కొంత కాల మట దీవ్రతపము అతడు గావించెను. కాని యింక నేకాంత మున బరివ్రాజకము గడుప మనస్సు ఆతురత జెందుటచేత, శ్రీ శారదాదేవికడ నాజ్ఞగైకొని, అఖండానందునితో మన వివేకానందుడు పయనమయ్యెను. వారణాసి వైద్యనాథముల పునః దర్శించి, హిమాలయముల గొంతకాలము గ్రుమ్మరి, హరిద్వారమున అఖండానందుని వదలి, ఏకాంతము నిచ్ఛగించి యతడు ఢిల్లీనగరమున కేతెంచెను.

ఇట నుండియే మన వివేకానందుని దక్షిణయాత్ర ప్రారంభమని వచింపనగును. కొన్ని దినములు ఢిల్లీయందు గడిపి వివేకానందుడు రాజపుత్రస్థానమున ప్రవేశించెను. అట నాళ్వారు నగరమున నొక సామాన్యుని యింట నుండి ప్రజానీకమునకు అనేకవిషయముల బోధించుచుండ, నగర మంతయు నాతని నామముతో మారుమ్రోగెను. ఆ విషయముచే నాకర్షింపబడిన ఆళ్వారు రాష్ట్ర ప్రధానోద్యోగియగు శంభునాథుడు ఈ యతివరేణ్యుని తన గృహమున కాహ్వానించెను. ఆళ్వారు మహారాజుయొక్క దివాను రామచంద్రజీ వివేకానందుని దర్శించి, పాశ్చాత్య నాగరికతా వ్యామోహబద్ధుడైన తమ మహారాజును, వివేకానందుడు సన్మార్గమున నుంపగలడని విశ్వసించి మహారాజు యతిరాజుల సమావేశము గలుగ జేసెను. విగ్రహారాధనయందు విశ్వాసములేని యాళ్వారు భూపతిని మన వివేకానందు డెట్లు భక్తు నొనర్చెనో గాంచుడు. మహారాజు విగ్రహారాధనాదులందు దనకుగల అవిశ్వాసమును ప్రకటించి వివేకానందునితో వాదింప గడంగెను. వెంటనే

వివేకానందుడు యోచించి, మహారాజుయొక్క చిత్రపటము నొకదాని దెప్పించి, 'ఈపటముపై నుమియుడు' అని దివానుని యాజ్ఞాపించెను. కాని దివాను అందులకు భయమునొంది, 'స్వామిజీ, ఇది మహారాజుగారి పటముగదా! దాని నెట్లు అగౌరవింతును?' అని తిరిగి స్వామిని ప్రశ్నించెను. 'మహారాజు వేఱుగనుండ నీకాగితమును మహారాజు అనెదవేమి? ఇది బొమ్మయేగదా! అయినను దీనిపై నుమియుట మహారాజును అగౌరపరచినట్లు అగుచున్నది' అనుచు, వివేకానందుడు మంగళసింగు మహారాజును చూచి, 'రాజా, చూచితివా? నీవు యీ పటమున కన్యమైయున్నను, నీకెట్లు గౌరవమొసంగుచున్నారో అట్లే నీఛాయారూపమునుగూడ అందరు దిలకించుచున్నారు. ఇదేవిధముగ భక్తులుగూడ విగ్రహముల గాంచునప్పుడు, వారి వారి యిష్టదైవములనే చూచుచు, అర్చనాదుల సల్పుచున్నారు. వారు విగ్రహముల విగ్రహరూపమున భావించి 'ఓవిగ్రహమా, నాకు ముక్తి నొసంగుము' అని ప్రార్థింపక అది శిలయో, దారువో యను విషయము మరచి, సంపూర్ణ భగవద్విశ్వాసమున లీనమై 'ఓదేవా, నాకు నీయందు భక్తిని ప్రసాదింపుము' అని ప్రార్థించుచున్నారు' అని వివేకానందుడు 'తం యథా యథోపాసతే తదేవ భవతి' ఆదేవదేవు నెట్లుపాసించెదరో ఆస్వరూపముగ భగవంతుడు మారును అను ఛాందోగ్యశ్రుతి భావము ననుసరించి విగ్రహారాధనమునం దంతర్గత సూత్రభావమును వివరింపగా మహారాజాశ్చర్య మోదములు ముప్పిరిగొన, త్యాగాధినాధుడగు మన వివేకానంద మహారాజునకు జోహారుజేసి 'నష్టో మోహః స్మృతి ర్లబ్ధా

త్వత్ప్రసాదాన్మయాచ్యుత। స్థితోస్మి గత సందేహః కరిష్యే వచనం తవ॥' కృష్ణా నీయనుగ్రహముచే మోహము నశించి, స్మృతినిబొంది, సందేహ రహితుడనైతి గాన నిక నీయాజ్ఞాను సారమే వర్తింతును అని గీతాబోధానంతరము అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మకు బ్రణమిల్లినట్లు ఆళ్వారు మహారాజుగూడ 'స్వామీ, అనుగ్రహింపబడితిని. నా దురభిప్రాయమును మార్చితిరి' అని నుడివి మన వివేకానందునకు శిష్యుడై మనెను.

అంత వివేకానందస్వామి జయపురమును జేరెను. అచ్చట నొక విద్వాంసునొద్ద అతడు పాణినీయ అష్టాధ్యాయి వ్యాకరణమును బఠించెను. వ్యాకరణాభ్యసన కాలమున వివేకానందుడు ప్రకటించిన సూక్ష్మబుద్ధికి ఆపండితుడు చాల ఆశ్చర్య చకితు డయ్యెను. అంత ఆబూ పర్వత గుహాయందు గొంత కాలము తపమొనరించి ఖేత్రీమహారాజు యాహ్వానముపై నటకేగి, మహారాజసేవల నొందుచు రాజమందిరమున గొంత కాలముండెను. అచ్చటగూడ నొక పండితునివద్ద పాతంజల భాష్యమును అభ్యసించుచు, నా పండితునికిగూడ దెలియని కొన్ని వ్యాకరణ రహస్యముల వెలిబుచ్చి నాతని ముగ్ధునిగా వివేకానందుడు గావించెను. అవును, పరావిద్యయగు బ్రహ్మ విద్యయే యీ యతికులావతంసునకు హస్తగతమై యొప్ప, నింక నీస్థూలవిద్యల మాటేల? అందుచేత 'ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి' ఒక్క పరబ్రహ్మ జ్ఞానముచేత సర్వజ్ఞానములు కలుగు నని బృహదారణ్యక శ్రుతి వాక్యము దృఢముగా వక్కాణించుచున్నది.

మహారాజాహ్వానముల నంగీకరించి వారిగృహముల వాసంబుండియు, సర్వసమత్వమున వివేకానందుడు ఖేత్రీ మహారాజు నెట్లు ప్రేమించునో, యట్లే పేదసాదల సహితము ప్రేమించుచుండెను. అవును, 'యస్తు సర్వాణి భూతాని ఆత్మ న్యేవాను పశ్యతి సర్వభూతేషు చాత్మానం తతో న విజు గుప్సతే॥' సకల భూతకోటిని ఆత్మయనియు, ఆత్మయే సర్వ భూత సముదాయమనియు, ఎవడు దర్శించునో అట్టివాడు ఎవరిని ఏవగించును ? అను ఈశావాస్యోపనిష ద్వాక్యచంద మున మహానుభావుడగు మన వివేకానందునకు భేదదృష్టి కలుగుటెట్లు? అట్లు అతడు సర్వసమత్వమున సర్వప్రజలకు ఆధ్యాత్మిక ప్రబోధ మొనర్చుచు, దేశ సౌభాగ్య సంధా యకుడై వెలయుచుండెను. రాజాధిరాజులే యతనికి వశంవదు లగుచుండ నిక బ్రజల దేమున్నది? 'యథా రాజా తథా ప్రజా' అనునది ఆర్యోక్తి కదా !

ఖేత్రీనగరమున గొంతకాలముండి యంత వివేకా నందుడు జూనాఘడ, భూజనగరము, పోర్బందరు, పూనా నగర ముల దిరుగుచు మైసూరు పట్టణమున కేతెంచెను. పూనా నగరమున బ్రఖ్యాత సంస్కృత విద్వాంసుడైన బాలగంగాధర తిలక్ యింటనే ఆతిథ్యము స్వీకరించి వివేకానందుడు ఆపండిత వర్యునితో ననేక విషయముల బ్రసంగించెను. మైసూరున మహారాజగు చామరాజేంద్ర ఒడయరు వివేకానందుని యపార పాండితీగరిమ కానందపరవశు డయ్యెను. ఆంగ్లభాషాజ్ఞానము అభివృద్ధిజెంద, పాశ్చాత్య గ్రంథముల నెల్ల పఠించి, అందలి లోపాలోపముల గమనించి, ప్రాచీన భారతీయ వాఙ్మయమును

గ్రహించి, దానగల యుత్కృష్టతను దీవ్రముగ నధ్యయనము గావించి, సర్వాదర్శ తత్త్వముల హృదయమున బదిలపరచి, ప్రాక్పశ్చిమ భేదముల నవగాహన మొనరించుకొని, సకల శాస్త్ర పాండిత్యమును సంపాదించి, ఆ సకల శాస్త్రములును జిహ్వాగ్రమున నర్తనము సలుపజేయు మన వివేకానంద స్వాముల వారి వాక్సుధాపారావారమున మజ్జనమాడి, అందలి మధురరుచుల జవి చూచుటచే, నా మహారాజు యీసన్న్యాస చక్రవర్తి కమూల్యసంపదల నీయ సంకల్పింప, త్యాగవిభూషణుడైన వివేకానందు డద్దాని దృణముగ ద్రోసిపుచ్చెను. 'న కర్మణా న ప్రజయా ధనేన...' అను కైవల్యోపనిషత్తు మంత్రమురీతి నుండె నీ సన్న్యాస సార్వభౌముడు. కేవల గ్రంథ జ్ఞానమైనచో నా రాజాధిరాజుల సహవాసముచే నహంకార గర్వములు అభివృద్ధిచెందును. కాని 'గ్రంథ మభ్యస్య మేధావీ జ్ఞాన విజ్ఞాన తత్పరః। పలాలమివ ధాన్యార్థీ త్యజే ద్గ్రంథ మశేషతః॥' ధాన్యము గాంక్షించువా డెట్లు తృణమును వదలివేయునో అట్లే జ్ఞాన విజ్ఞానరతుడగు ధీశాలియు గ్రంథముల బఠించి పిమ్మట దాని నిశ్శేషముగ ద్యజింపవలయు నని మోక్షార్థి యగువానికి అమృతబిందు ఉపదేశము. సర్వ గ్రంథములును 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అనియే బోధించుచున్నవి. ఆ యంతరార్థమును గ్రహించి, 'ఆత్మజ్ఞానం వినా పార్థ సర్వకర్మ నిరర్థకం' అను గర్భగీతోక్తిరీతి ఆత్మజ్ఞానము లేనిచో సర్వకర్మములు వ్యర్థములని భావించి, ఆత్మజ్ఞానము నార్జించినట్టి మహానుభావు డగుటచేతను, మూర్తీభవించిన త్యాగరూపమగు శ్రీరామకృష్ణ పరమహంసదేవుని శిష్యాగ్ర

గణ్యుడై చెలువొందుటచేతను మన వివేకానందుడు త్యాగ ధనాధిపతియై యుండగల్గెను. మరియు నా రాజేంద్రుడు తనకు పాదపూజచేయు సంకల్పమును దెలియజేయ నందుల కేమాత్రము సమ్మతింపడయ్యెను. అదియేగదా నిర్లిప్తస్థితి !

అంత నీ త్యాగధనుడు కొచ్చిన్ జేరి యటనుండి రామేశ్వరము కన్యకుమారి క్షేత్రముల కరిగెను. కన్యకుమారి అగ్రిమున యోచనానిమగ్నత నాసీనుడయ్యెను. భారతదేశమునకు దక్షిణమునగన్యకుమారియే అగ్రము. అంతియుకాక నీక్షేత్రము, తూర్పున బంగాళాఖాతము, పశ్చిమమున అరేబియా సముద్రము, దక్షిణమున హిందూమహా సముద్రముగలిగి, ప్రకృతి సౌందర్యమునకు, ప్రశాంత వాతావరణమునకు, తపోనిష్ఠకును నిలయమై యొప్పుచున్నది. మరియు నిట దేవాలయమున శక్తి స్వరూపిణియు, హిమవంతుని పుత్రికయు, పార్వతియు నగు ఉమ కన్యకుమారీ నామధేయముతో నొప్పుచు, భక్తులకు గోర్కెలదీర్చు కల్పవృక్షమో యనునట్లు చెలువొందుచుండును. ఆ మూర్తిని దర్శించినతోడనే సకలపాప పరిహార మగునని భావింపకమానను. చిరునవ్వు దీపించుమోముతో, ఒక హస్త మభయ మొసంగుచుండ, రెండవ కరమున జపమాల ప్రేలాడు చుండ, 'ఆకౌమార మునివ్రతాం' అనునట్లు తపస్వినియైయుండు నా లోకమాతను ఒక్క పర్యాయమైనను దర్శింపనివాడు భారతీయు డనజెల్లడు. అట్లుకాక అటనే వాసముండుచు, సముద్రత్రయమున స్నానమాడి, ఆ జగన్మోహనమూర్తిని సందర్శించి, సాధనల గావించుకొనువా డచిరకాలమున ఆ జగదంబా

అనుగ్రహాముచే నజ్ఞాన సంద్రప్రటావలిదరిజేరి, బ్రహ్మానంద మున లీనమై సార్థకజన్ముడగుట తథ్యము.

కాన మన వివేకానందుడట జేరి, దేశభక్తియుతుడై 'ఆహా! నేటికిగదా భారతమాతృ పాద సన్నిధి జేరితి'నని సంతోషస్వాంతు డయ్యెను. మరియు నా సముద్రత్రయమున నొక చిరుకొండను కన్యకుమారీ అగ్రముగా భావించి, దాని జేరి, దానిపై ధ్యాననిష్ఠుడయ్యెను. అట్లు ధ్యానమగ్నుడైన మన వివేకానందుని ముందొక దివ్యమంగళమూర్తి యావిర్భ వించి, మందహాసవదనయై 'బిడ్డా! నీ సందేశ మీ దేశమున గాదు. ధనమదాంధులై, భౌతికసుఖములే యథార్థములని భావించుచు, సందేమునుగుచు, బరమతముల దోషములగాంచి అపహసించుచు, స్వీయ దుర్గుణముల గ్రహింపనేరక హింసా మార్గగాములైయున్న పాశ్చాత్యమున నీ బోధ లత్యవసర ములు. అటకేగి, నీ దివ్యాధ్యాత్మిక తేజోప్రకాశముచే వారి యజ్ఞానాంధత బాపి, వివేకమును గలిగించి, సర్వమత ప్రాతిపదిక యగు భారతీయ వేదాంత పతాకను ప్రతిష్ఠించి రమ్ము. పొమ్ము. ఇది ధ్యానముననుండు సమయముకాదు. అన్యమత ప్రాభవము అధికమైయుండు నీ కాలమున, దాని దూరముగ బారద్రోలు టకు వేదాంత మొక్కటియే శరణ్యము. లెమ్ము. త్వరితముగ కార్యసాధనమునకు పూనుకొనుము' అని హెచ్చరికజేసి యంతర్హితమయ్యెను. ఎవరామూర్తి? ఆమెయే లోకకల్యాణ మును గాంక్షించు జగన్మాత! ఆమెయే సకల చరాచరభూత కోటిని గన్న మాతృమూర్తి! ఆమెయే అఖిల ప్రపంచగత జీవ రాసుల బోషించు జగదంబ! ఆమెయే కన్యాకుమారి అగ్రా

ధిష్ఠాన శక్తిస్వరూపిణి! ఆమెయే కన్యాకుమారి! తక్షణమే యానందబాష్పములు కన్నుల నావరింప, మాతృభక్తి తత్పరుడగు వివేకానందుడప్డే కొంతతడవు ప్రస్తుతకాలపు అధమస్థితిని దలంచి, దుఃఖించి, భారతమాతృ శ్రేయస్కాములై, భారతజాతి సముద్ధరణైక దీక్షతో బాశ్చాత్య ఖండములకేగి, భారతజాతీయ ప్రభావము జాటి, అందు బ్రతిష్ఠించి, రా దీర్మానించుకొని, తన సంకల్పమునకు రూప మొందింప 1892 వ సంవత్సరమున కన్యాకుమారినుండి చెన్నపురము మన వివేకానందస్వామి జేరెను.

సిద్ధసంకల్పుడైన మన వివేకానందుడు చెన్నపురము జేరుతోడ నతనిమూర్తి సర్వాకర్షణీయమై ఎల్లహృదయ పీఠముల నధిష్టించిన దయ్యెను. అక్కడ వివేకానందుని వాఙ్మాధుర్యమును అనుభవించి అనేకులు పండిత పామరులుగూడ నతని శిష్యులుగనైరి. యువకు లనేకులు స్వాములవారి జుట్టును జేరి యనేకవిధముల నుత్సాహమును బడసిరి. అట్టి యువకులపై వివేకానందుడు దృష్టినుంచి బోధించుచుండెను. ఆ కాలమున అమెరికాదేశమునగల షికాగోనగరమున సర్వమత సమ్మేళన మొందు పాశ్చాత్యులచే నేర్పాటుగావింపబడెను. మన వేదాంత విజ్ఞాన ప్రబోధమునకై, భారతీయ ఔన్నత్య స్థాపనమునకై ఆ సమావేశమునకు వివేకానందు డరుగుట ముఖ్యమని గ్రహించి, ఉత్సాహపూరితులగు యువకబృందము 900 రూప్యములగూడ ప్రోగుజేసిరి. కాని జగజ్జననియగు కాళికాదేవి యాదేశము ఇంకను రాకుండుటచే నా పైకమును దీనుల కన్నదానమునకై వినియోగింప వివేకానందుడు ఆజ్ఞ

నిడెను. కాని అమెరికా కరుగ సంకల్పము అతని హృదయము నుండి పీడలేదు. అట్టి సమయమున నొకనాడు మన వివేకానందుడు సముద్రతీరమున విహరించుచుండ, సమ్మహాసాగరము మధ్యనుండి శ్రీ రామకృష్ణ గురుదేవుడు వివేకానందునిగూర్చి హస్తమునూపుచు, రమ్మనుచు నంతర్హితుడయ్యెను. కలయా సత్యమా యని లో వితర్కించుకొనుచు అభయమునొంది అమెరికా కేగుటకు అతడు సంసిద్ధుడయ్యెను. అంతటితో తృప్తిగాంచక నతడు శ్రీ శారదామాయికి వ్రాయగా నామెయు ధైర్యము గొల్పుచు,నాశీర్వదించుచు వ్రాసెను. 'నేనుండ నీకు భయమేల? నీకుముందు నే నరుగుదును,రమ్ము'అని శ్రీరామకృష్ణదేవుడభయ హస్తము జూపుచుండ, ప్రతీచీవాసుల హృదయముల నానంద సుధను నింపి రాగలవు' అని మాతృదేవియు ప్రేమమూర్తియు నగు శ్రీశారదామాయి ఆశీర్వాదములుండ, వారిరువురు వివేకానందుని కిరుప్రక్కల దోడు నీడయై యొప్పార నిక వివేకానందు డట కేగినను విజయదుందుభి మ్రోగి, కీర్తిచంద్రికలు అతని ముంపరాక తప్పునా? మహాత్ముల ఆశీర్వాదప్రభావ మట్టిదిగదా!

భక్తునకుముందు భగవదనుగ్రహముండురీతి శిష్యునకును ముందు గుర్వనుగ్రహము అట్లే యుండితీరును. శిష్యుల హృదయగత సంశయముల బరికించి, వాని నిర్మూలము గావించుచు, అధైర్యసమయముల ధైర్యోత్సాహముల బెంపొందింపజేయుచు, సర్వదా తోడునీడయై, ఎట్టి బాధయు గలుగనీయక అభయము నొసంగుచు, ప్రేమవాత్సల్యముల దిలకించు పారమార్థిక మాతృమూర్తియగు గురువును గను శిష్యుల యదృష్టమే యదృష్టముకదా ! అట్టి గురుపుంగవుడు మన

వివేకానందునికి లభ్యమగుటయే ఆతని మహోత్కృష్టత! పసిబిడ్డను గాపాడు మాతృదేవతవోలె దన శిష్యుని కరమును జేగొని గురుదేవుడు నడుపుచుండ నింక నాతని హృదయమున భయమునకు దావేది? ఎట్లు అనేకపర్యాయము లా మహానుభావుని దివ్యహస్తము తన అమూల్యమగు శిష్య రత్నమును గాపాడెనో యింకను ముందు గాంచెదముగాక!

## పాశ్చాత్య ప్రయాణము

ఈవిధముగ ధైర్యలక్ష్మిని జేగొని వివేకానందు డుండ, బుత్రప్రాప్తినొందిన ఖేత్రీపురాధీశుడు అతని దన యాస్థాన మునకు గొంపోయి సకలవిధముల గౌరవించి, స్వాములవారి సంకల్పము ననుసరించి, పశ్చిమఖండ యాత్రకు వలయునన్ని ఏర్పాటుల గావించి, 1893 మే నెలలో బొంబాయి నగరము నుండి వీడ్కోలు నొసంగెను. వివేకానంద యతీంద్రుడు మార్గ మధ్యమునగల చైనాదేశమున నొకదిన ముండి, హాంగ్ కాంగు సమీపమునగల నొక బౌద్ధ దేవాలయమును దర్శించి, అందుండు ప్రాచీన గ్రంథ భాండాగారమును గాంచి ఆనందించెను. అటులే జపానుదేశమునకు ముఖ్యపట్టణములైన టోకియో, యోకోహామాల జూచి జపాను దేశీయుల ధీకుశలతకు విస్మయా నందముల నొంది, అమెరికా దేశమును జేరెను. షికాగో నగరమున నొకచో బసచేసి, ప్రపంచ వస్తుప్రదర్శనమున కేగుచు, పాశ్చాత్యదేశ వైభవమును గాంచుచు, అటగల సంపన్నతకు ఆశ్చర్యము నొందుచు ఆనందించుచుండెను. కాని

ధనవ్యయములో బేరెన్నికగనిన దేశమగుటచేతను, సర్వము అత్యధిక విలువగలవై యుండుటచేతను, వివేకానందుని అత్యావసరములకుగూడ నతని ధనము శీఘ్రగతి వ్యయమగుచుండెను. సమ్మేళనము సమావేశమగుట కింకను మూడు మాసము లుండునని విచారించి అతడు గ్రహించెను. అందుచే నతడు చింతించి, షికాగోనగర సమీపమునగల బోస్టన్ పురమున మిత వ్యయముతో గాలము గడుపుటకు నిశ్చయించుకొనెను. మరియు, సమ్మేళనమున నతడు పాల్గొన ముందుగా నిర్వాహక వర్గమునకు దెలుపకుండుటచేతను, ప్రతినిధుల గాను తేది దాటి పోవుటచేతను, నతడు సభల బాల్గొను నవకాశమునుగూడ నన్నగిల్లెను.

అందుచే నిరాశాపీడితుడై వివేకానందుడు బోస్టన్ నగరమునకు ప్రయాణము గావించుచుండ, నదే రైలులో ప్రయాణము గావించుచున్న Skateburn స్కేట్ బర్న్ అను ఒక వనితారత్నము అతని గాంచి, సంభాషించి, ధైర్యము జెప్పి, బోస్టన్ నగరమునగల తనయింటికి ఆహ్వానించి గొంపో యెను. కాని ఎందును దాగని అతని విద్యా వక్తృత్వము లనేకుల నాకర్షించి ఆశ్చర్యము గలుగజేసెను. విద్యావాహినీ నిలయమగు వివేకానందుని ఉపదేశ వాక్యముల నాకర్షింప జేరినవారిలో హార్వర్డ్ విశ్వవిద్యాలయ పండితమహాశయుడగు డాక్టరు రైట్ అను నాతడు స్వామి ప్రజ్ఞాపటుత్వమును గాంచి, అద్భుతముజెంది 'ప్రపంచ మహాసభలలో మీరు హిందూమత ప్రతినిధిగా నుండవలెను' అని ప్రోత్సహించి, సభాధ్యక్షుడు తన మిత్రుడగుటచే నొక యుత్తరమును వ్రాసి మరల వివేకానందుని

అతడు షికాగో నగరమునకు బంపెను. కాని మార్గమధ్యమున, మన వివేకానందుడు చిరునామా కాగితమును బాసి, నాటి రాత్రి దిక్కుతోచక, నొక రైలుస్టేషనులో దీవ్రమైన శీతల బాధకు గురియై, విశ్రాంతి గొనెను. అది జర్మనుభాషా ప్రాంత మగుటచే నతనికి దారి జెప్పువారైనను లేకపోయిరి. తెల్లవారిన పిమ్మట ఆకటిబాధ యెక్కుడగుటచే సన్న్యాస ధర్మానుసారియై అట భిక్షనర్థింప నొక్కరైనను అతనికి నాహార మిడరైరి. క్రమముగ భాస్కరుడు గగన మధ్యభాగమున నధిష్ఠించెను. క్షుద్బాధకును ఆతపబాధకును నోర్వజాలక నొక పెద్దభవనము ముందు, దీపస్తంభము నానుకొని మన వివేకానందుడు స్పృహ దప్పి నేల కొరిగెను.

ఆహా! దైవ సంఘటనములు విచిత్రములుగదా! పర మత దూషణమే ప్రధానముగాగలిగి, ఆచరణ విహీనులై యుండు వారి దోషముల బహిర్గత మొనర్పగల ధైర్యసాహసో పేతునికా యీ బాధలు కలుగుట! ప్రథమమున సర్వమత మహాసభల ప్రసంగించుట కవకాశమీయమని వచించినవారి చేతనే మరల నాహూతుడై, యఖండ గౌరవమర్యాదల నంద నున్న మన వివేకానందునికా యిట్టి దీనదశ! సర్వ గ్రంథావ లోకన మొనర్చి, అనుభవసంపదల దుబదూగి, పాశ్చాత్త్యుల హృదయముల నదరజేసిన మహాప్రవక్తకా యీ యవస్థలు! భారతీయ శాస్త్రవైభవము నెల్లెత్తిచాట గురువరేణ్యు నాదే శానుసార మేతెంచిన శిష్యాగ్రగణ్యునికా యీ సంకటములు! ప్రాచ్య అజ్ఞానతిమిరమును భారతీయ వేదాంత ప్రచండ కిరణ సంచయముచే బారద్రోలు శ్రీ వివేకానంద భాస్కరునకా

యీ యనర్థములు! అచిరకాలముననే వేలమంది ప్రతినిధులలో హిందూమత విశిష్టతనుగూర్చి యుపన్యసించి, పండితుల ప్రశంసలగొనుచు మేటి వక్తయని, బాగ త్తల నొందనున్న మన వివేకానందుడు నాడు ఎట్లుండెనో గాంచుడు! అట్లు వివేకానందయోగి బాహ్యస్మృతి దప్పియుండ నా యెదుటి గృహము నుండి యొక వనిత యతని దగ్గర కరుదెంచి, 'మహాశయా, సర్వమత సమ్మేళనమున కరుదెంచిన వారు మీరేనా?' అని ప్రశ్నించి, తన గృహమునకు దోడ్కొనిపోయి, వసతుల నన్నింటి నేర్పాటుగావించెను. అట వివేకానందుడు గొంత విశ్రమించి, ఆమెను జేరబిలిచి, 'నేను సర్వమత సమ్మేళనమునకే తెంచినట్లు నీకెట్లు తెలియు'నని ప్రశ్నించెను. ఆమెయు 'స్వామీజీ! నేడుదయమున నేను పదిగంటలకు ఉపాహారమునుగొని కొంతతడవు విశ్రమించితిని. అంతలో గాలదిగ నిద్రయు నన్నావరించినది. అంత గన్నుల నిర్మలప్రేమ వ్యక్తమగుచుండ, ఆ నేత్రద్వయమున నేదియో అవ్యక్తమగు ఆకర్షణ మిళితమైయొప్ప, మోమున బ్రహ్మతేజము చిందులు ద్రొక్క, కాంతివంతమగు శరీరముతో, త్యాగమూర్తియనదగు సుమారు ఏబది వత్సరముల ప్రాయముగల తూర్పుదేశీయుడు నాకు స్వప్నమున గోచరించి, 'ఏమది? ఇంకను నిదురించుచుంటివా? లెమ్ము. నా బిడ్డ యిట మీ సభలలో బాల్గొనుటకు వచ్చియుండెను. నిద్రాహారములులేక అలమరుగు నా బిడ్డ డిదే నీ గృహమున కభిముఖముగ నేలకొరిగి యున్నాడు. నీవు అతని నాహ్వానించి, సర్వమును జేకూర్చి, సభలలో బ్రసంగించుటకు స్థానమును గల్పింపుము. పరికింపుము. సమస్త

బాధలకుగురియైన నా శిష్యుని ముఖమును గాంచుము. వ్యవధి లేదు. శీఘ్రగతి రమ్ము' అని పలుకుచు నా తమోగుణమును బాపు రవివోలె మేల్కొలిపెను. కాని నేను దాని సరకు గొనక మరల నిద్రలోమునుంగ, మరల నాతడు దర్శనమిచ్చి పైవిధముగ వచించెను. నేను జాగ్రదవస్థకువచ్చి సౌధోపరి భాగమునుండి మిమ్ముల జూచి, మిమ్ముల గుర్తించి యాహ్వానించితి' నని యామె వివరముల దెలుప, స్వామియు సజల నేత్రుడై, 'గురుదేవ్ ! నన్ను సర్వవిధముల గంటికి రెప్పవలె గాపాడుచుంటివా ! తొలి కష్టముల మలిసౌఖ్యముల గలిగించి నా నిలకడను బరీక్షించుచుంటివా ప్రభూ ! నీదయ ఎల్లవేళల నిట్లే వర్షించు గాక!' యని తన మనమున సద్గురుమూర్తికి ప్రణతుల నర్పించెను. అడుగడుగునకు గష్టరూప మేఘము లావరించుటయు, వానిని చెదరగొట్టుటకు గురుకృప యను మలయమారుతము వీచుటయు వివేకానందుని జీవితమున ననేక పర్యాయములు గోచరము.

పిమ్మట మన వివేకానందుని ఆమె సమ్మేళన కార్యాలయమునకు గొంపోయెను. అట్టి విషమ సమయమున నతని కండయై నిలిచి తర్వాత వివేకానందుని శిష్యగణముల ముఖ్యురాలై నిలచిన నా ధన్యజీవియే డాక్టర్ హేల్. సభానిర్వాహకులును వివేకానందుని ప్రతినిధిగా ఆనందముతో స్వీకరించిరి. అంతకు మున్ను దిక్కులేని వానివలె వీధుల దిరుగాడుచున్న వివేకానందుడే క్షణములో నా హేల్ దంపతుల యాతిథ్యమున సేవలంది, యే శ్రమయు లేక సమ్మేళనమున ప్రతినిధిగా గైకొనబడెను. అదియే భగవల్లీలా విలా

సము! శ్రీ రామకృష్ణుడింకను శిష్యుని శక్తి సామర్థ్యముల బరీక్షించుచుండెనేమో! లేక కష్టసుఖముల సమత్వమును అతనికి నేర్పుటకై యట్లు గావించెనేమో! అందలి యంతరార్థము భక్తులకే యెరుక !

## సర్వమత మహాసభ

ఆ విషయముల నాడు మన మా సభాస్థలి యాసీనులమై, ఆ వివేకానందుని వాఙ్మాధుర్యమును దనివితీర గర్ణపుటంబుల గ్రోలి యానందింపకున్నను, నేడు ఆ యమృతవాక్కుల బఠించి, సంతసించుభాగ్యమునకైనను అవకాశమును గల్పించిన భగవానుని కెంతయు గృతజ్ఞులము. ఇక మనముగూడ వివేకానందునితో సభకు వెడలుదమా !

రోమన్ క్యాథిలిక్ మతాధికారియగు కార్డినల్ గిబ్బన్సు సభ నలంకరించెను. ప్రాక్పశ్చిమదేశ పండితాగ్రేసరులెల్లరు ఉచితాసనముల నలంకరించి యుండిరి. ఒక్కొక్క మతమునకు గొందరు ప్రతినిధులుండిరి. సుమారు పదివేలమంది శ్రోతలా సభాస్థలమున నాసీనులై యుండిరి. ఆ సభాస్థలి గల బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవ, బ్రాహ్మమత ప్రతినిధుల మధ్య శుభోదయ సూచికమగు కాషాయ వస్త్రములలో సువర్ణ ఛాయతో నొప్పారి, అత్యంతాకర్షవంతమగు మూర్తిమత్వము గలిగి, అధ్యక్షునికి దక్షిణమున చతుర్థస్థానము నలంకరించి, సభ కలంకారతుల్యుడై వివేకానందుడు నాడు ఎల్లర దృష్టి నాకర్షించుచు సభావేదికపై నుండెననిన జాలును. సభకు

అనిబిసెంటు, ప్రతాపచంద్ర ముజుందారు, ధర్మపాల మొదలగు భారత ప్రముఖు లనేకులు అరుదెంచియుండిరి. ప్రార్థన గీతములతో సభాప్రారంభము జరిగెను. క్రమముగ ప్రతినిధులెల్లరు ప్రసంగింపజొచ్చిరి. వివేకానందు డనిన వారివలె ముందుగ నుపన్యాసమును సంసిద్ధ పరుచుకొనలేదు. అభ్యాసము లేకుండుటచే ఆ సభారంగము అతనికి భయము గొల్పెను. మరియు నెన్నడును వేలమంది కభిముఖుడై నిలిచి అతడు యుపన్యసింపలేదు. అంతియగాక నవ్యదేశమగుటచే నేమో సభాధ్యక్షుడెన్ని పర్యాయము లుపన్యసింప గోరినను, భీతిచే మన వివేకానందుడు వెనుకంజ వేయుచుండెను. సంశయాస్పదుడై యధ్యక్షుడు 'వివేకానందుడే యుపన్యసించు' నని ప్రకటించెను. ఇక దప్పదని మన వివేకానందుడు నిశ్చయించి, లేచి నిలచి, ఆ విశాల నేత్రములచే నందలి జనుల హృదయకుహరముల దన దృష్టి జొన్పించెనో యనునట్లు, ఒకసారి సభాసదుల దిలకించి, గురుదేవుడగు శ్రీ రామకృష్ణుని మనమున ధ్యానించి, My dear sisters and brothers of America అమెరికా దేశపు సోదరీ మణులారా, అని సభ్యుల సంబోధింప, నా సభాస్థలి యానంద స్థలియై కరతాళధ్వనులచే నేమి, 'హుర్రె హుర్రె' యను జయధ్వానములచే నేమి, ఆకాశము దద్దరిల్లెను. కారణ మేమి? ఇంతవరకు అనేకులు 'సభాసదులారా' అనియు, 'సభ్యులారా' యనియు, 'పండితులారా' యనియు సంబోధించిరే గాని, ఒక్కమాటలో హిందూమతాదర్శమగు సర్వ సౌభ్రాతృత్వమున నమెరికా దేశీయుల నెల్లర సోదరదృష్టి సంబో

ధించువారు పూర్వమెవ్వరును లేరైరి. అది నాటి సభాసదుల నానందవాహినుల ముంచెత్తిన దని యర్థము.

నాడు మన వివేకానందుని వాక్యములు సనాతనధర్మ ముఖ్యాంశముల ప్రతిధ్వనించెను. సర్వప్రపంచ సన్న్యాస సంప్రదాయమున కాదియగు వైదిక సన్న్యాసము తరఫున సర్వసమన్వయము సర్వ సౌభ్రాతృత్వముల ప్రపంచమునకు జాటు మతములకు జననియైన హిందూమతమును సభికుల కెరుక పరచుచు, 'ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం' అను సూక్తి విధానమున సర్వమార్గములు ఆ పరమేశ్వరుని మాత్రమే చేర్చు'నని వివేకానందు డుద్బోధించెను. ఆ ప్రఖ్యాత పండితసభలో నత డుపన్యసించుట ప్రథమమున జాల స్వల్ప కాలమైనను, అందిమిడియున్న సమన్వయత్వము, విశాల హృదయము, బోధనా విధానము నాటి సభికులనేగాక, అమెరికాఖండము నంతటిని సమ్మోహితుల గావించెను. సామాన్య పరివ్రాజక జీవితమును గడుపుచుండు మన వివేకానందుడు నాటి యుపన్యాసముతో జగద్విఖ్యాతితో యథార్థ నరేంద్రుడై తనరి, వేదారణ్యముల గ్రుమ్మరు వేదాంత కేసరివలె గర్జించెను. మరుసటి దినమునకు ఆ చిన్న యుపన్యాసము ప్రత్యేకముగ ప్రకటింప బడుటయేగాక షికాగో నగరమం దంతట గోడలపై పెద్దవియగు వివేకానంద చిత్రములే! ఆ చిత్తరువు గాంచు ప్రతివ్యక్తియు, గౌరవసూచకముగ తన టోపీని దీసి తలవంచి, జోహారు చేయుచుండిరి. ఏపత్రికను గాంచినను మన వివేకానందుని సంస్తుతులు దక్క అన్యమునకు దావు లేదు. ఆ దేశమున ముఖ్యపత్రికలగు 'న్యూయార్కు హెరాల్డు' 'బోస్టన్

ఈవినింగు ట్రాన్స్క్రిప్టు' 'న్యూయార్కు క్రిటిక్' 'అయోవా స్టేట్ రిజిస్టర్' మొదలగు పత్రిక లన్నియు శ్రీ వివేకానందుని వాక్యములతో స్తుతులతో నిండిపోయినవి. ఆయొక్క ఉపన్యాసము వలన పాశ్చాత్యులెల్లరు యీ ప్రాక్ప్రతీచీ సకలవిద్యా సమన్వయమూర్తియొక్క దివ్య చరణదాసులైరి. సర్వమత సర్వాధ్యాత్మికానుభవ సమన్వయ స్వరూపుడగు శ్రీరామకృష్ణుని శిష్యరత్నమగు మన వివేకానందుడుగాక సర్వసమత్వరూపమగు వేదాంతబోధన కర్త లెవ్వరు! సర్వమత సమ్మేళనమున బదునేడు పర్యాయములు ప్రసంగించుటయే గాక, నాటినుండి అమెరికాఖండమునం దెల్లెడల ననేక సంస్థలలో నుపన్యసించుచు, ఆనందామృతధారల వర్షింపజేయుచు, పాశ్చాత్య పండిత హృదయసీమల భారత జాతీయతను, వేదాంత తత్త్వమును జొప్పించుచు, కోటీశ్వరుల యాతిథ్యమునుగూడ గైకొనుచు, శ్రీవివేకానందస్వామి పర్యటించెను. అంతటి భోగభాగ్యముల నున్న స్థానముల నున్నను, హాయిని గాంచక దుఃఖాక్రాంత చిత్తుడై, లోకమాతయగు కాళికను దలంచుచు 'భారతదేశమును దరిద్రతనుండి యుద్ధరించు టెట్లు?' అను చింతతో నతడు బాధనొందెడివాడు. తన కీర్తిచంద్రికలు నలుదెసల వ్యాపింప నహంకారము నెందకుండుటయేగాక, ఆవిశాల హృదయక్షేత్రమున ప్రేమకుగాక అన్యమునకు స్థలమభావమేమో! స్వల్ప విషయములకే గర్విష్ఠులమైయుండు మనకు అత డెంతదూరమో!

ఇట్లు మన వివేకానందుడు భారతావని జన్మించి, సాధనావతారమగు శ్రీరామకృష్ణ పరమహంసదేవుని ప్రముఖ

శిష్యుడై, అహంకార నిమగ్నులగు పాశ్చాత్యుల దన వాగస్త్రమున సమ్మోహితుల నొనర్చి, ప్రపంచమున భారతాంబను ఉన్నతస్థానమున పునః ప్రతిష్ఠ గావించెనను వార్త ప్రాగ్దేశీయుల కర్ణపుటంబుల సోకునంత, ఆనందకందళిత హృదయులై సమ్మోద గగనవీథుల విహరించిరి. ముఖ్యముగా వివేకానందుని జన్మభూమియగు గలకత్తావాసుల యానందమున కంతులేదు. మరియు నచ్చోటనే యొకే గురువు నాశ్రయించి సాధనాదుల గావించిన సోదర శిష్యుల యనంతానందమును వర్ణింప నేరి కగును? సర్వభారతీయులు అత్యానంద మగ్నులై మన వివేకానందునకు కృతజ్ఞతాభివందనముల హృదయపూర్వకముగ నర్పించిరి. రామనాథపుర మహారాజగు భాస్కర సేతుపతియు, ఖేత్రీనగరాధిపతియగు అజిత్సింగు మొదలగువారును వివేకానందునికి దమ ప్రేమను కృతజ్ఞతల నందజేసిరి. కలకత్తా నగర వాసులు ఒక బృహత్సభ గావించి వివేకానందునికి ఆనందమును దెల్పిరి.

## వేదాంత ప్రచారము

కాని ప్రపంచమున నెల్లరు ఒకేరీతి నుండరుగదా! కాన నీర్ష్యాగ్రస్తులగు గొందరు క్రైస్తవులు మన వివేకానందు డమెరికాదేశమున సుప్రశస్తి గాంచెనని యాలకించి, ఆ యశస్సును గించపరుప యత్నించిరి. కాని అట్టి ప్రజ్ఞాశీలుర కీర్తిని కూలద్రోయుటకు యత్నించుట ప్రదీప్తమగు వహ్నిని జేగొని అధోముఖము గావించినచో నయ్యగ్ని యూర్ధ్వ

ముఖమై విరాజిల్లు చందమున నుండుగదా! మరియు 'పాషాణో భిద్యతే టంకైః వజ్రం వజ్రేణ భిద్యతే। సర్పోపి భిద్యతే మంత్రైః అనూయాత్మా న భిద్యతే॥' టంకముచే పాషాణము, వజ్రముచే వజ్రము, మంత్రములచే సర్పము యడంగును గాని, మాత్సర్యవంతుడుమాత్రము, దేనిచేతను సంస్కరింప బడడు అని శ్రుతి వాక్యముగదా! అయినను వారు చేయ గల్గిన దెద్దియును లేదు. 'సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధం' ప్రపంచమున సర్వమునకు ఔషధము గలదుగాని మూర్ఖునకుమాత్రము లేదను నీతిశతక వాక్యము యథార్థము గదా! ఇట్టి దుష్ప్రచారము లాదేశముల కైస్తవులు సాగించినను జలింపక, మన వివేకహాని పాశ్చాత్యదేశ ముల దన దిగ్విజయ యాత్రను సంపూర్తి గావించుకొన నిశ్చ యించుకొనెను. షికాగోనగరమున వివిధ మతసంస్థలలో వార మునకు బండ్రెండుకు పైగా నుపన్యాసముల నొసంగుచు, వేదాంతప్రచారము సాగింప నాతని ప్రజ్ఞా విశేషమునకు నెల్లరు శరణుజొచ్చిరి. వివిధ పట్టణములనుండి యనేక యాహ్వా నములపై నరిగి యుపన్యసించుచు, బోస్టన్, కేంబ్రిడ్జి, వాషింగ్టన్, న్యూయార్కు, బ్రూక్లిన్ మున్నగు పురవరము లలో, హైందవ విజ్ఞాన ప్రవాహము పాశ్చాత్యదేశముల ముంచెత్తుచున్నదో యనునట్లు వివేకానంద యోగీంద్రుడు వేదాంత ప్రచార మొనరించెను. హిందూమతమున ముఖ్య ములగు రాజయోగ జ్ఞానయోగములు, నింకను యనేక తాత్త్విక విషయముల నందందు వివరించి యతడు గొప్ప ప్రబోధము గావించెను. కాన సర్వమతస్థులు సర్వమత సమ

న్వయరూపుడగు మన వివేకానందుని ధీశక్తిని గొనియాడి, భారతాత్మ మహిమమును వేనోళ్ళ స్తుతించి సన్నిహితులైరి. అట్లు కేవలము సన్నిహితత్వము నొందుటేగాక, మన వివేకానంద యోగీంద్రునికి ముఖ్యశిష్యులై, యతనితో గొందరు భారత దేశమున కరుదెంచి, తమ జీవితముల నాధ్యాత్మికముగ బెంపొందించుకొనుచు భగవదనుగ్రహము నొందిరి. వారిలో గొందరి యర్థ్యతలగాంచి వివేకానందుడు సన్న్యాసమునుగూడ నొసంగెను. Leon Landsberg లియోన్ లాంన్స్బర్గ్ అను నతడును, Mme. Marie Louise మేరీ లూయీ అను నామెయు సన్న్యసించి కృపానంద, అభయానంద నామముల స్వీకరించిరి. కొందరు స్వాములవారియొద్ద బ్రహ్మచర్యదీక్షను గైకొని తమ జీవితముల బవిత్రము గావించుకొనిరి. ఇట్లు అట ఆధ్యాత్మిక విద్యాప్రదాన మొనర్చుచు, తన ఆధ్యాత్మికోన్నతిని గ్రహించినవాడుగాన, వివేకానందుడు, ధనవంతుల నాశ్రయించి తన వ్యక్తిత్వమును గోల్పోవక, సర్వస్వతంత్రత మెలంగెను. దేహ, ధన, మనశ్శక్తులు ఆత్మబలమునకు దాసోహమేగదా !

పిమ్మట ఇ. టి. స్టర్డీ మొదలగు ఇంగ్లండు పౌరులు వివేకానందుని నట కాహ్వానింప, తన కిసుమంత విశ్రాంతి లేకున్నను, అజ్ఞమానవ శ్రేయస్కాముడైన అతడు సమ్మతించి ఇంగ్లండు దేశమున కేగెను. ప్రథమమున ఫ్రెంచిదేశమున ప్యారిస్ పురములో కొన్నిదినములుండి యంత లండన్ నగరమును అతడు జేరెను. హిందూయోగి పుంగవు డరుదెంచె నను యుత్సాహమున లండనులో బత్రికాధిపతులేమి,

పండితులేమి, పామరులేమి అసంఖ్యాకములుగా నతని దర్శింప రాజొచ్చిరి. ఇక పత్రికా ప్రశంసల వేరుగ వక్కాణింపవలయునా ? ఇచ్చోటనే మహాద్భుత సంఘటన మొండు జరిగెను. అది ఇంగ్లండు దేశమునకే గాక భారత దేశమునకును ముఖ్యముగ స్త్రీలోకమునకు ప్రముఖమై ఆదర్శమై యొప్పారినది. విద్యావతియై విద్యా సంస్థల నిర్వహించుచు, నాధ్యాత్మిక చైతన్యము వివేకానందుని చూపు మాత్రమున బొంది, భారత దేశమున కేగి, తన జీవితమును భారతనారీ విద్యాసేవలో నిమగ్న మొనరించి ధన్యత నొనరించుకొనిన Miss Margaret Noble మిస్ మార్గరెట్ నోబుల్ అని ప్రథమమునను, సోదరి నివేదిత యని తర్వాతను ప్రఖ్యాతి నొందిన వనితారత్నము లండను నగరముననే వివేకానందుని కలిసికొనెను. లండను పౌరుల వేదాంత గ్రంథ పఠనములకొరకై నందు సంఘమును నెలకొల్పి మరల వివేకానందు డమెరికా కరిగెను.

మన వివేకానంద మునీంద్రుడు హార్వర్డు మొదలగు విశ్వ విద్యాలయముల పండిత వర్గమునకు ప్రాగ్దేశ విద్యాయౌన్నత్యమునుగూర్చి యుపన్యసించి వారి సంకుచితత్వమును నిర్మూలించెను. 'భారత నారీమణుల యాదర్శము'లను విషయముల నొకచో వివేకానందు డుపన్యసింప నటగల స్త్రీ సంఘము లనేకములు అతని తల్లియగు భువనేశ్వరిని స్తుతించుచు, నీ అభినందన పత్రమును భారత దేశమునగల యామెకు నందజేసినవి. 'శ్రీ మద్వివేకానంద మాతృదేవి సన్నిధికి, అమ్మా! 'భారతనారీమణుల యాదర్శములు' అను ఉపన్యాస

మును స్వామియొసంగి మమ్ముల గృతార్థులజేసెను. ఇట్టి సుగుణఖని, విశాలహృదయుడగు నీ సుతుని దివ్య సందర్శన మహాభాగ్యమును లభింపజేసిన నీ కివే మా ధన్యవాదములు. జననీ నీ కుమారరత్నముచే నీవు కొనసాగించుచున్న ఘనకార్య మును, నీ అద్భుత జీవితమును దలంచి మే మొసంగు కృతజ్ఞ తాపూర్వక అభినందనల స్వీకరింపుమని ప్రార్థించుచున్నాము'.

అవును, విద్యాధిక్యతచే పెద్ద ఉద్యోగమునుజేయు పుత్రునిగాంచియే సామాన్యముగ దల్లిని పొగడుదురే, అపార విద్యాగరిమచే శోభిల్లుచు, అనుభవ సాగరమున నీదులాడుచు, సర్వజనీన హృదయరంజకముగ సర్వమత సామరస్యముల ప్రవాహరూపమున ధైర్యముగ నుపన్యసించుచు, జక్కని వ్యక్తిత్వముగలిగి, త్యాగాధినాథుడై చెల్వొంది, ముప్పదియవ ఏటనే ప్రపంచ సంస్తుతుల నొందిన యీ యతిరాజవరేణ్యుని, ఆ విశాల ధీ సంపన్నుని, ఆ నిర్మల నిష్కల్మషమూర్తిని, ఆ జగద్విఖ్యాత పురుషునిగన్న తల్లిని అభినందింపకుందురా? సర్వ హృదయ సంక్షోభముల దెగటార్చుటకు, మానవ శ్రేయ స్కామియగుటకు సకల శక్తిసామర్థ్యములగల ఆ బిడ్డను లోక మున కొసంగిన ఆ తల్లి ఋణమును మనమెట్లు తీర్చుకొన గలము? ఆమెకు భువనేశ్వరీమాత యను నామము సార్థకమై రాణించెను. అట్టి పుత్రుని బ్రసాదించిన ఆమె వందనీయురాలు. పుత్రునికై శివుని యర్థించుచు, నా ఈశ్వరువలెనే యోగీశ్వరుడై సర్వశక్తినిలయుడై, లోకపూజ్యుడై తన కుమారుడు మనవలె నని యీమె ప్రార్థించియుండనోపు! లేనిచో నంత బసితనము ననే విరాగధనుడై, విద్యావిభూషితుడై, జగద్వంద్యుడై

మనుట సుసాధ్యమా? ఇట్లే అష్టవర్షప్రాయమున గృహమును త్యజించి, సద్గురు సన్నిధిప్రాలి, సకల శాస్త్రాధ్యయనము గావించి, పదునాల్గవ వత్సర ప్రాయముననే దేవభాషయు నమృతభాషయు నగు సంస్కృతమున జటిలమును, కఠినమును, పండితోత్తములకుగూడ అగ్రాహ్యమగునట్లుగ ఉపనిషత్, బ్రహ్మసూత్ర, భగవద్గీతలకు భాష్యమును లిఖించి, దేశముల బర్యటించి, కర్మఠుల నోడించి, అద్వైతులనుగ జేసి, విశాల విశ్వ విఖ్యాతి నార్జించిన శ్రీ శంకరాచార్యుని; బాల్యమాదిగ సమాధుల దులదూగుచు, సర్వాధిష్ఠాన కాళికాశక్తినిగొల్చి, సకల దేవతల సాక్షాత్కారమునొంది, అద్వైత పరమావధిని బొందిన శ్రీ రామకృష్ణాది మహాపురుషుల గనిన మహాతల్లులు ఆచంద్రార్కముగ సర్వప్రపంచ సంస్తుతుల బొందుచున్నారు గదా! వారి కీర్తి దిగంతముల వ్యాప్తినొందును.

పిమ్మట న్యూయార్కునగరమున నాతనిచే వేదాంత సంఘ మొండు నెలకొల్పబడెను. 1896 లో మరల లండను పౌరులచే నాహ్వానింపబడి యేగి కొంత విశ్రాంతిని గాంక్షించిన వాడై, తన యమెరికాయుద్యమముల సాగింప భారతదేశము నుండి శారదానందుని రావించెను. అటులే ఇంగ్లండు దేశ ప్రచారము గావింప అభేదానందునిగూడ వివేకానందుడు పిలిపించెను. సోదరశిష్యులు దీర్ఘకాలానంతరము గలియుటచే వివేకానందు డానందభరితు డయ్యెను. మన వివేకానందుని యశః కాంతులు, ప్రఖ్యాత తత్త్వశాస్త్ర కోవిదుడును, భారత దేశముయొక్క యుత్కృష్టతను గ్రహించినట్టి యసమాన సంస్కృత విద్వాంసుడైన మ్యాక్సు ముల్లరును జేరెను. అతడు

మన యతీంద్రుని తన గృహమున కాహ్వానించి, ఆతిథ్య మొసంగెను. ఆపండితద్వయము కొంతకాలము గోష్ఠి గావించిరి. తర్వాత స్వామికి విశ్రాంతి అత్యవసరమగుటచే ముల్లరు, సేవియర్ దంపతులు అతని ప్యారిస్, జినీవా, స్విడ్జరులాండు మొదలగు విశ్రాంతి స్థానములకు గొంపోయిరి. జర్మనీదేశమున గల కీలు విశ్వవిద్యాలయ తత్త్వపండితుడైన Deussen డ్యూసేన్ గూడ నతని సమ్మానించి గౌరవించెను.

## భారతము - పునరాగమనము

ఇట్లు విదేశముల విశ్రాంతి యిసుమంతయు లేక, వేదాంత ప్రచారమొనర్చి, అఖండ విజయలక్ష్మిని జేపట్టి, మాతృదేశమున విశ్రాంతిగైకొను బుద్ధి వొడముటచే వివేకానందుడు లండను నగరమునుండి సేవియరు దంపతులతో బయనమయ్యెను. ఆసమయమున 'స్వామీజీ, ధన ధాన్య సమృద్ధమగు నీదేశమున నాలుగు వత్సరము లుంటిరి గదా! ఇప్పుడు మీ భారతదేశమునుగూర్చి మీ భావమేమి?' అని ఒక లండను మిత్రుడు ప్రశ్నింప, వెంటనే మన వివేకానందుడు 'ఇచటికి రాక బూర్వము మాదేశమును దెలియని రీతి ప్రేమించియుంటిని. కాని ప్రస్తుతము అట్లుగాదు. భారతదేశ ధూళియే పరమ పవిత్రమనియు, అచ్చటగల వాయువు మహాభాగ్యమనియు, నదియే పావన పుణ్యక్షేత్రమనియు దలంతును' అని భారతదేశముపైగల తన భక్తి, అనురాగములు ముఖమున దొణికిసలాడ మందహాస వదనారవిందుడై అతడు

ప్రత్యుత్తర మొసంగెను. చూచితిరా, భారతదేశముపై నతని ప్రేమ! కనుగొంటిరా, జన్మభూమిపై నతనికి గల అభిమానము! అట్టి పవిత్ర ప్రేమాభిమానములు మాతృదేశముపై నుండుట చేత గదా అతడు విదేశముల భారతాధిక్యతను ప్రబోధించెను. కాన నట్టి దేశభక్తి విరాజిల్లినగాని దేశక్షేమమునకై యెవ్వ రైన బాటుపడుట దుర్లభము.

వివేకానందుని భారతదేశాగమనము సోదరశిష్యుల కును అభిమానులకును దెలుపబడెను. అందులకు సోదరుల యానందమునకు మేరలే లేవు. భారతీయులెల్లరు వివేకానంద యతివరేణ్యు నాహ్వానింప నఖండ ప్రయత్నముల నొనరుచ్చు చుండిరి. సోదరులు వివేకానందునికొరకై కలకత్తా నగరమున నున్న యాలశ్యమగునుగాన, అంతవర కోర్వజాలక మద్రాసున కేతెంచిరి. ఒకరు సింహళమునకే చేరిరి. అవును, ఆ పరస్పర సోదర ప్రేమమును శ్రీ రామకృష్ణుడే వారి హృదయముల, వారి శిక్షణ సమయముననే పెంపొందింపజేసెను. వివేకా నందునిపై వారి కట్టి ప్రేమయే లేనిచో శ్రీ గురుదేవుడు వారల వివేకానందుని కెట్లు ఒప్పగింపగలడు? యథార్థముగ వారలకా ప్రేమ గౌరవము లాతనిపై లేకున్న శ్రీ రామకృష్ణ నిర్యాణా నంతరము బారా నగరములో నాతని శిక్షణమున కొడంబడి, సర్వమును వర్జించి, జననీ జనకుల ధిక్కరింతురా? ఆతని యాజ్ఞల శిరసావహించి, సన్న్యసించి, పరివ్రాజకులై దేశముల గ్రుమ్మరుదురా? ఆ ప్రేమయే లేకున్నవారు శ్రీ రామకృష్ణ పరమహంసదేవుని శిష్యులని వచింపరాదు. అట్లు సర్వత్ర కీర్తి నార్జించి యరుదెంచు తమ అగ్ర సోదరుని గాంచుటకు వారి

యుల్లములెంత ఆతురతనున్నవియో! ఆ సోదర ప్రేమ ప్రవాహము బహిర్గతమగుచుండ దాని నెంత అరికట్ట యత్నించిరో ఎవరి కెరుక! ప్రతీచీదేశముల విజయదుందుభి మ్రోగించి, వారి హృదయాంతరాళముల వేదాంత గర్జారవముల బ్రతిధ్వనింపజేసి, రాజఠీవితో బునరాగమనము గావించు మన వివేకానందుడు ప్రథమమున సింహళమున బాదము నిడ, అచ్చటి పౌరు లా సన్న్యాసచక్రవర్తి కెట్టి ఘనస్వాగతము నొసంగిరో గాంచి యానందింతురా ?

పవిత్ర కాషాయాంబరముల దాల్చి, వివేకానంద భాస్కరుడు అరుదెంచుచున్నాడను విషయమును గ్రహించి, ఖిన్నముఖుడై సూర్యభగవానుడు పశ్చిమాద్రి గ్రుంకుచుండ, అజ్ఞాన తిమిరమును బారద్రోలి, యఖండాధ్యాత్మిక దివ్య జ్యోతిని బ్రజ్వలింప జేయు అపూర్వ మహావ్యక్తి యాగమన పురస్సరంబుగా నంధకారమును రూపుమాప బట్టణమునం దెల్లెడల విద్యుద్దీపములు మిరుమిట్లు గొల్పురీతి బ్రకాశింప, సముద్ర ఘోషకు వేయిరెట్లధికముగ సోదర ప్రజాఘోష మిన్ను ముట్టుచుండ 1897 జనవరి 15వ తేది సంధ్యాసమయమున వివేకానందుడు కొలంబో నగరమున స్టీమరు దిగెను. జై జై ధ్వానములు గగనమును జీల్చుచుండెను. సహస్రాధిక పుష్పమాలలచే స్వామిని గౌరవించి, సుందరమైన శకటమున సభావేదికకు నా ప్రజలు గొనిపోయిరి.

ధనరాసులమధ్య ప్రాగ్దేశమున బర్యటించి, భారతీయ ఔన్నత్యమును ఎల్గెత్తిచాటి, ఆర్షధర్మధ్వజ ప్రతిష్ఠగావించిన నా

యువక సన్న్యాస చక్రవర్తిని అంత ఘనముగ ప్రజలెల్లరు ఊరేగింపుగావించి, సన్మానింప, నట దనకు ఆ పట్టణవాసు లొసంగిన సన్మానమునకు ఆ మహానివర్యుడొసంగిన సమాధానము ఎట్టిదో గ్రహింపవలయునుగదా! 'శత్రుమధ్యమున ధైర్యసాహసముల యుద్ధము గావించి, విజయశ్రీని గొనివచ్చిన గొప్ప సైన్యాధిపతిననియా, దేశనాయకుడననియా, లేక కోటీశ్వరుడననియా నాకు మీ సన్మానము! కాదు. కాలినడ కను దిరుగుచు, క్షుత్పిపాసాపీడితుడై బాధల ప్రమగ్గుచు, తరు తలవాసియై, కరతల భిక్ష గొనుచు, కావి వస్త్రములదాల్చిన యొక పేద సన్న్యాసికి మీ స్వాగతము. నేడు మీరిడిన సన్మానము ఒక వ్యక్తికిగాదు. సనాతన ధర్మోద్భూత త్యాగమునకును, ఆర్ష సంప్రదాయమునకును, వేదవిజ్ఞానగత పారమార్థిక సంపదకును ఈ మహాసన్మానము జరిగినట్లుగా నేను భావించుచున్నాను. మరియు దేశమున నెంతయో పారమార్థిక శీల సంపదలు గలవని దెలియుట కిది యొక ఉత్తమ చిహ్నముగా దలంచుచున్నా'నని మన వివేకానందుడు ఉపన్యాసమును ప్రారంభించెను. ఏమి యీ గంభీర వచనములు! అందెంత నిర్లిప్తత వినయము లుట్టిపడుచున్నవో గాంచుడు! అందేమైన గర్వాహంకారములకు తావుగలదా! గ్రంథజ్ఞాన మలవడినంత, ఆ పాండిత్యమునకు సంతసించి నలుగురు నమస్కరింప వెంటనే అహంకారము వృద్ధిసెందును. ఇక దానితోబాటు ధనికవర్గ ప్రాపకము సంపాదించిన నింకను గర్వ మతిశయించును. అట్టిచో 'విద్యా దదాతి వినయం' అను సూక్తి యన్వయింపక వినయవిధేయతలు వారికి దూరముగా నుండును. కాని తుల

లేని పాండిత్య ప్రకర్ష కలిగియు, మహారాజాధిరాజులే పాదా క్రాంతులైనను గర్వమును దరికి జేరనీయకుండుట అనుభవ పరులకే సాధ్యముకాని తదితరులకు దుర్లభము. అట్టి స్థితి శ్రీ రామకృష్ణపరమహంస దేవునియందు గానవచ్చును. అదియే గురుపరంపరాగతమై మన వివేకానందుని ఆవరించినది.

అంత సింహళముననే గల క్యాండి, జాఫ్నా నగరముల స్వాగతంబుల స్వీకరించుచు, వారి కసంఖ్యాక సందేశముల నొసంగుచు, మన వివేకానందస్వామి పాంబన్ పురమునకు జేరు నప్పటికి నాయతికుల సార్వభౌమ దర్శనార్థమై రామనాథ పురా ధీశ్వరుడగు భాస్కర సేతుపతికూడ, నట కరుదెంచి, తన రాజశకటంబున గూర్చుండ జేసి, దాని హయముల నూడ దీయించి, తానే ఆశకటము లాగెను. ఆహా, సేవలగొను రాజచంద్రులే యీ యతిచంద్రున కెట్లు జోహారు చేయు చుండిరో గాంచితిరా! అటనుండి ఆ యోగీంద్రుడు రామే శ్వరు దర్శనార్థ మేగెను. వివేకానంద విజయ సూచికము గను, ఆతని మాతృదేశాగమన జ్ఞాపకార్థముగను నచట నా రాజేంద్రుడు ఒక విజయస్తూపమును నిర్మింపజేసెను. దానిపై మన వివేకానందుని దిగ్విజయ యాత్రనుగూర్చియు, మాతృ దేశ ఆగమనమును గూర్చియు నొక శాసనమునుగూడ రామ నాథపురాధీశుడు వ్రాయించెను. అంత నాయతీశ్వరుడు రామ నాథపురము, మధుర, తిరుచునాపల్లి కుంభకోణములలో స్వాగత సన్మానపత్రముల నందుకొని, మార్గమధ్యమున గల యనేక రైలుస్టేషనులలో అసంఖ్యాక భక్తకోటికి దర్శన మిచుచు, మద్రాసును చేరెను. కొన్నిచోట్ల చిన్నస్టేషను

లలో రైలు ఆగకుండుటచే నచటి భక్తకోటి ఆ మహావ్యక్తిని దర్శింప కృతనిశ్చయులై, రైలు పట్టాలపై బరుండి రైలును ఆపు జేయించి ఆనందోత్సాహములతో నా యుగపురుషుని గాంచి పవిత్రులైరి. హృదయపూర్వక ప్రేమ ఎట్టి త్యాగమునకైన వెనుదీయదుగదా !

వివేకానందుడు పరివ్రాజక జీవితమును గడుపుచు, ప్రథమమున చెన్నకగరమునకు వచ్చుటతోడ నాతని ఉపన్యాస విధానమును, వివేకమును, వ్యక్తిత్వమును గాంచిన భక్తులు కొందరు స్వామిని విశ్వమత మహాసభలకు వెళ్ళుడని ప్రోత్సహించియుండిరి. అట్లు అరిగిన వివేకానందుడు దిగ్విజయముగా మరలుటయు వారి ఉత్సాహానందములకు పట్ట పగ్గములు లేవయ్యెను. ఆ యానందోద్రేకములచే వారు గృహముల నుండజాలక ఆయన దర్శనాకాంక్షతో ఎదురు జూడసాగిరి. ఏవీధిని గాంచినను వివేకానందుని ఆగమనవార్తను ఆలకించి ఆయనను దర్శించుట కేగువారలే. ఏ ప్రసంగములనైన వినినచో వివేకానంద నామస్మరణమే. ఆబాలగోపాల మా వివేకానంద స్వాగతమునకు తహతహ పడుటజూడ వారి హృదయుల నామూర్తి ఎంత శాశ్వతముగా ప్రతిష్ఠింపబడెనో!

ఇక చెన్నకగరమున మన వివేకానందయోగి చేరుతోడ స్టేషనుకు బట్టణమంతయు స్వాగతమిడ నేతెంచెను. 'జై శ్రీవివేకానంద స్వామీజీ మహారాజ్‌కు జై' అనియు, 'జై శ్రీరామకృష్ణ పరమహంస దేవునకు జై' అనియు, నినాదములు కర్ణపుటంబుల గింగురుమని మ్రోగుచుండ, మన వివేకానందునకు సుందర

శకటమున నూరేగింపు ప్రారంభింపబడెను. కొంతదూర మరిగిన పిమ్మట, కళాశాలా విద్యార్థిబృందము శకటమునకుగల గుర్రములనూడదీసి తామే యాశకటమును లాగి, మన వివేకానందునిపైగల అపార భక్తిప్రపత్తుల వ్యక్తపరచి సగర్వముగ నానందించిరి. నవరాత్రిచందము మద్రాసులో దొమ్మిదిదినము లుండి, యనేక యుపన్యాసముల నతడు గావించెను. ఆయుపన్యాసములు జాల సుప్రసిద్ధములై యొప్పారి యున్నవి.

చెన్నపురి సన్మానానంతరము వివేకానందస్వామి, ఫిబ్రవరి 15 వ తేదీకి శీతకిరణ జ్యోతివలె గలకత్త నగరమున కేగుదెంచెను. స్వాతివర్షమునకు వేచియుండు ముత్యపు చిప్పల వలె, వివేకానందు నెప్పుడు గాంతుమా యని ఆతురత నిరీక్షించు వంగీయుల నాటి యానందాతిశయమును యీ చిన్ని కలమునకు వర్ణింప సాధ్యముకాదు. వివేకానందునికై ప్రత్యేకముగ నేర్పాటుచేయబడిన రైలు గలకత్తాను సమీపించినంతనే వారి ఆనందమున కంతులేదు. కలకత్తాపట్టణ వాసులును, శ్రీరామకృష్ణదేవుని సన్న్యాస శిష్యులును వివేకానందున కఖండ స్వాగతమొసంగ పురోభాగముననుండిరి. శ్రీ వివేకానంద స్వాములవారి శరీరమంతయు బుష్పమాలావృతమైనను ముఖపద్మము మాత్రము షోడశకళా సంశోభితుడైన పున్నమ చందురునివోలె బ్రజాసమూహమునకు గన్పట్టుచుండెను. గొప్ప నగర మహోత్సవము బయల్వెడల, గొంతమంది విద్యార్థులును, యువకులును ఉత్సాహపూరితులై హయముల నావల నునిచి స్వయముగ వాహనమును లాగసాగిరి. పట్టణమంతయు సుందరముగ నలంకృతమై యొప్పెను. ఇంకను వారి యానం

దము అవ్యయము, అఖండము, అనంతము, అనిర్వాచ్యము, అచింత్యము అని మౌనము ధరింతము. అదియే యుత్తమ మార్గముగదా! వర్ణింప వలనుగాని దాని వర్ణింప యత్నించుటయు నసమంజసము. కలకత్తాపురవాసు లర్పించిన ఘన స్వాగతము, శోదర శిష్య సమూహముయొక్క దీర్ఘకాలానంతర దర్శనము మన వివేకానందు నెంతయో ఆనందమున ముంచివైచెను. అసంఖ్యాక ప్రజానీకముచే నిండిన సభాస్థలిలో, వివేకానందునకు 'ఇండియన్ మిర్రర్' పత్రికాధిపతియగు నరేంద్రనాథసేన్ ప్రేమపూర్వక స్వాగతపత్ర మొసంగెను. ఇంక ననేక సన్మానపత్రము లర్పింప బడెను. అంత ప్రతిదినము రాత్రింబవళ్ళు భక్తబృందము స్వామిదర్శనమును బొంది ఆనందించిరి. దర్శింపవచ్చిన ప్రజానీకమునకు, హిందూమత ప్రాశస్త్యమును, భారతదేశాధిక్యతను, భారత వ్యక్తిత్వమును, శ్రీరామకృష్ణ దేవుని యౌన్నత్యమునుగూర్చి ప్రసంగించుచు, నిశీధి సోదర శిష్యవర్గమునకు ప్రేమస్వరూపుడై మానవ జీవిత గమ్యమును, బ్రహ్మచర్య విధానమును, నిష్కామ కర్మ, సన్న్యాసాదర్శము, శ్రీగురుదేవుని ఆధ్యాత్మిక వ్యక్తిత్వము, బ్రహ్మానంద సముపార్జనోపాయములను బోధించుచు, వారి నుత్తమాదర్శ పురుషులుగ నొనర్చుటకై ధైర్యోత్సాహముల వివేకానందుడు బురిగొల్పుచుండువాడు.

# శ్రీ రామకృష్ణ మఠస్థాపనము

ఇంతకాలము తమ గురువరేణ్యుడైన శ్రీ రామకృష్ణదేవుని పేర ప్రత్యేక మఠము లేకుండుటచే సోదరశిష్యులందరు మఠ నిర్మాణమునకై సంకల్పించుకొనిరి. మహోత్కృష్టములగు గురూపదేశ ప్రచారసాధనముగ మఠ నిర్మాణమొనరించినగాని జన్మ సాఫల్యత గాదని వారు విశ్వసించి, పావన గంగాతీరమున బేలూరుగ్రామమున పదునైదు ఎకరముల గృహ నివేశనస్థలమును విక్రయమును గావించుకొనిరి. ఆమహోద్యమమునకు మన వివేకానందుని పాశ్చాత్య శిష్యులు అధిక ధనమొసంగిరి. ఆమఠ నిర్మాణము ఒక వత్సరము పట్టినది. పిమ్మట శ్రీ రామకృష్ణ ప్రతిష్ఠా మహోత్సవ ముహూర్తమున శ్రీవివేకానందుడే శ్రీ గురుదేవుని అస్థి సంచయముగల పాత్రను నీలాంబరముఖర్జీ గృహమునుండి స్వయముగా శిరమున నుంచుకొని నూత్న మఠమునకు గొనివచ్చెను. ఆ పవిత్రాస్థికల నిర్ణీత వేదికపై నిడి, హోమ జపాదుల గావించి, శ్రీరామకృష్ణుని శాశ్వతముగా నట వెలసి సదా భక్తుల ననుగ్రహింప బ్రార్థించుచు, 1898 వ సంవత్సరమున డిశంబరు నెల 9వ తేదీ శ్రీ గురుదేవుని ప్రతిష్ఠను మన వివేకానందు డొనరించెను. నాటనుండి నేటివరకు ఆ జగద్గురు వర్యుడు ముముక్షుకోటికి ఆధ్యాత్మికానందమును బ్రసరింపజేయుచు, దన శిష్యునియొక్క ప్రార్థన నంగీకరించి యుండెనుగదా!

# మ హా స మా ధి

తీవ్ర పరివ్రాజక జీవితమునుండి, అమెరికా ఖండమున భారత విజ్ఞాన పతాక నెగురవైచి, ఎడతెరిపిలేని యుపన్యాసములచే ప్రపంచ అజ్ఞ మానవోద్ధరణ కార్యమున నిమగ్నుడైన మన వివేకానందునకు క్రమముగ శారీరక వ్యాధి యంకురించెను. అయినను నిర్లక్ష్యభావమున నతడు, మరల కొన్ని పట్టణముల కరిగి యుపన్యాసముల గావించుటచే నావ్యాధి తీవ్రరూపము దాల్చెను. భక్తులెల్ల రాతురతజెంది ఔషధసేవ నేర్పాటుగావించిరి. అసమాన ఆధ్యాత్మికానందమును జూరగొనిన నమ్మహావ్యక్తి అనిత్యమగు నీశరీరమునకు గలిగినవ్యాధి జరా మరణముల లక్ష్యము సేయునా ? కాన వివేకానందుడు మహాసమాధి పర్యంతము శిష్యుల కనేక అమూల్య ఉపదేశముల నొసంగుచు, సంస్కృత విద్యాదుల బోధించుచు, శిష్యవర్గముతో యథాపూర్వముగ ఛలోక్తులతో నానందముగ కాలము గడుపుచుండెను. తనను లోకమున సృజింప జేసి, తనచే జేయింపవలసిన కార్యముల శ్రీ విశ్వేశ్వరి పూర్తిజేయించెనని మన వివేకానందుడు గుర్తెరింగి, తన శరీరమును పరిత్యజింప సంకల్పించి, ఒక శుభముహూర్తమును నిర్ణయించుకొని, బ్రహ్మరంధ్రమును భేదించి 1902 వ సంవత్సరమున జూలై నెల నాల్గవ తేది మన వివేకానందుడు యీ సంకుచిత స్థూలశరీరమును వదలి అఖండ బ్రహ్మైక్యానుసంధానము నొందెను. 'న స పునరావర్తతే' అనునట్లు బ్రహ్మవిదులు మరల జనింపరుగదా! మన వివేకానందుడు స్థూలము

నకు మనల బాసినట్లున్నను నతని భావజాలములు మాత్రము మనల విడువక, భారతీయుల వెన్నంటుచు, 'లెండు! మీ మానవ జీవితమును సార్థకపరచుకొని, మీ దేశ క్షేమమునకును, లోక కళ్యాణమునకును స్వార్థరహితులై కృషిసల్పుడు' అని హెచ్చరించుచునే యున్నవి.

కాన, 'శైశవంబువనె ప్రారంభించి వర్ణించు-చో గలుగున్ జెందగరాని మోక్షసుఖ సంగాతంబు' అను నామదేవుని వచనానుసరణి బసితనముననే మానవజీవిత గమ్యము బొంద నిశ్చయించుకొని, దాని దృఢపరచుకొని, ప్రాపంచిక సుఖ సముదాయమును దూరముగ ద్రోసివైచి; భగవదన్వేషణాయత్త చిత్తుడై; తీవ్ర జిజ్ఞాసను ధరించి; అద్దానిచేతనే గురోత్తంసుడును, సర్వమతానుభవజాల రహస్యముల సాధించి గ్రహించినవాడును అగు శ్రీరామకృష్ణ భగవానుని యాశ్రయించి; త్యాగనిధియగు బుద్ధుని అనుభవమునకు, ధీనిధి యగు శంకరుని జ్ఞానమునకు ఏకైకస్వరూపుడే భగవాన్ శ్రీ రామకృష్ణదేవుడని గ్రహించి, సద్గురు పాదజాడల ననుసరించి, ఆనందాంబుధిమగ్నుడై నిర్వికల్పము నధిష్ఠించి; మరల ప్రపంచ దుఃఖనినాదంబుల నాకర్ణించి; వారి నుద్ధరించుటకై ప్రతిజ్ఞ గావించి; సర్వప్రపంచ మాధ్యాత్మిక భిక్ష నర్థించుచుండ ఖండ ఖండాంతరముల కేగి; వేదకాలమున ప్రపంచాతీతులై మనిన సంయమీంద్రుల, దర్శనకాలమున లోకాతీతులై యుండియు ముముక్షుకోటిపై కృపాచిత్తులై వేదాంత మూలమగు దర్శనముల లిఖించిన ఋషీశ్వరుల, పురాణకాలమున రాజసభల నలంకరించియున్న యతివరేణ్యుల, బౌద్ధకాలమున శుద్ధ

జ్ఞాన సముపార్జనమే గమ్యమని సాధనాది నిమగ్నులైన భిక్షుల, శంకరుకాలమున వేదవేదాంగముల నధ్యయనముజేసి జ్ఞానార్థులైన సన్న్యాసవరుల, సర్వమత మూలమును, సర్వ మతాతీతమును, అఖిలాధ్యాత్మిక జ్ఞానకేంద్రమును, ప్రాచీనాధునిక విజ్ఞానసారమును, దివ్యమును, ఉన్నతమును, విశాలమును, శాశ్వతమును, సర్వతోముఖమును అగు వేదాంత జ్ఞానప్రవాహముచే నేటి ఆధ్యాత్మిక ప్రపంచమున నేర్పడిన సంకుచితాభిప్రాయముల ద్రెంచి, ఆధునిక విజ్ఞానసారమును అందు విలీన మొనరించి, విశాల ప్రపంచమున విశాలభావపూరిత వేదాంతమతమును విశాలపరచి, తన దివ్యసందేశమును గంభీరోపన్యాస పరంపరలచేతను, దివ్య గద్య పద్యాత్మిక రచనలచేతను సర్వత్ర ప్రసరింపజేసి, అయస్కాంతమువలె సర్వాకర్షణీయుడై, సర్వ మానవకోటి హృదయాంతర్గత జ్యోతియై, సర్వమానవ వంద్యుడై, సర్వప్రపంచ ప్రఖ్యాత మహాపురుషుడైన మన వివేకానంద సన్న్యాస సార్వభౌముడు యుగపురుషు డన వచ్చునా? ముమ్మాటికి అనవచ్చును. అనవచ్చు నేమిటి? యుగపురుషుడని చాటవచ్చును. అతడు అవతారపురుషుడే! నిక్కముగ నతడు మహాపురుడే! ఇట్టి లోకారాధ్యుడైన అవతార శ్రేష్ఠుని ఉత్తమాదర్శమును గ్రహించి, అతని జన్మదినమై పర్వదినమైన 26-1-1954 వ తేదీన, అర్ధాని గడింప గంకణము ధరించి, మాతృ గురు దైవభక్తుల గలిగి, ఆత్మ గురు మార్గ దైవవిశ్వాస చతుష్టయంబును బునాదిగా గలిగి, ధైర్యస్థైర్యంబుల నూతగా గొని, సాధన చతుష్టయ సంపత్తి నార్జించి, భారతజాతీయ పరంపరానుగత

పెన్నిధియగు వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థమును సంపాదించి, ప్రశాంతమును ఆనందమును అగు నా బ్రహ్మాత్మ్యమును బొందెదముగాక !

శ్లో॥ మేరుసర్షపయో ర్యద్వత్, సూర్యఖద్యోతయో రివ।
సరిత్ సాగరయో ర్యద్వత్, తథా భిక్షుగృహస్థయోః॥



# జీవిత విశేషములు

1863 నరేంద్రనాథుని జననము 12-1-63 ఉ॥ 6.34 లకు.

1879 కళాశాలయందు విద్య ప్రారంభము.

1880 శ్రీ రామకృష్ణుని దర్శనము.

1882 సద్గురు సన్నిధి.

1884 జనకుని వియోగము, కష్టపరంపర.

1886 శ్రీ రామకృష్ణుని మహాసమాధి - శ్రీ బారానగర మఠ స్థాపనము, సన్న్యాసాశ్రమ స్వీకరణము.

1887 వివేకానందుని పారివ్రాజ్య ప్రారంభము.

1891 దక్షిణభారత పర్యటనము.

1892 చెన్నపట్న వాసము.

1893 మే 31వ తేది అమెరికా పయనము,
సెప్టెంబరు 11 తేది సర్వమతమహాసభ.

1894 అమెరికా ఇంగ్లండు దేశములలో ప్రచారము.

1897 భారతదేశమునకు పునరాగమనము.

1898 శ్రీ రామకృష్ణ సేవాసంఘస్థాపనము, మఠప్రతిష్ఠాపనము.

1899 పాశ్చాత్యఖండముల పునః పర్యటనము.

1900 భారతమునకు పునరాగమనము, ఆరోగ్య భంగము.

1902 జూలై 4వ తేది సా॥ మహాసమాధి.

చదివారా! తప్పక చదవండి!

# సాధనరహస్యము

[మూడవ ముద్రణము]

1/8 క్రౌను 340 పుటలు రు. 2-25

## శ్రీ అనుభవానంద కృతము

శ్రీ మాతాజీ త్యాగీశానందునికి పూర్వం శ్రీ స్వాముల వారు వరుసగా వ్రాసిన ఉత్తరాల సంపుటి. వీటిలో అనేక సాధన సంశయాలు చర్చింపబడి చాలసులభంగా తీర్మా నింపబడియున్నవి. ఇది సాధక కల్పతరువంటే నిస్సందేహం!

## శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల

భీమునిపట్టణము



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీరామకృష్ణ లీలా సంకీర్తనము : (చతుర్థ ముద్రణము)

శ్రీరామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి భక్తి ప్రబోధకరముగా 132 కీర్తనలు.

$\frac{1}{16}$ డెమ్మీ. 200 పుటలు. రు. 0-62

2. శ్రీరామకృష్ణాంజలి : (తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణ వివేకానంద తత్త్వములగూర్చి భక్తి ఉత్సాహ పూరిత పద్యములు 100. 0-12

3. శ్రీ దక్షిణేశ్వరీస్తవము : (ద్వితీయ ముద్రణము)

భక్తితో దత్త్వవిషయముల ప్రబోధించు శతకము. 0-12

4. చిత్త ప్రబోధ : (ద్వితీయ ముద్రణము)

సాధకుల కనేక అమూల్య రహస్యముల బోధించు శతకము. 0-12

5. సాధనరహస్యము : (తృతీయ ముద్రణము)

ఆధ్యాత్మికాభివృద్ధికి మూలమైన యోగసూత్ర సాధన చతుష్టయముల చక్కని వ్యావహారిక భాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము.

$\frac{1}{8}$ క్రౌను. 340 పుటలు. 2-25

6. అనుభవానందము : (ద్వితీయ ముద్రణము)

అద్వైతానంద విభూతిని వ్యక్తపరచు శతకము. రు. 0-12

7. సాధనసుధ :

సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాల నొసంగు పద్యగ్రంథము.

1/8 క్రౌను. 62 పుటలు. 0-50

8. మన శారదామాయి : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు ఉత్సాహపూరిత సులభగ్రంథము.

1/8 క్రౌను. 116 పుటలు. 1-00

9. మన వివేకానందుడు : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము.

1/8 క్రౌను. 110 పుటలు. 1-00

10. మన రామకృష్ణుడు : (ద్వితీయ ముద్రణము)

శ్రీ త్యాగీశానంద విరచితము. జగద్గురు శ్రీరామకృష్ణుని అద్భుతాదర్శ సాధనవివరముల సుగమముగావించుగ్రంథము.

1/8 క్రౌను. 125 పుటలు. 1-00

11. సర్వ సిద్ధాంత సౌరభము : 1 వ భాగము.

దర్శనఖండము - ప్రథమ భాగము - సాంఖ్య యోగములు. శ్రీ కపిల పతంజలి మహర్షుల జీవితకాల విశేషముల సిద్ధాంతములు యిట చర్చితము.

1/8 క్రౌను. 850 పుటలు. 3-25

12. శాంతి సామ్రాజ్యము :

శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతి ప్రబోధ గావించు ఉత్తమ గ్రంథము.

1/8 క్రౌను. 40 పుటలు. రు. 0-38

13. శ్రీరామకృష్ణాదర్శము :

శ్రీరామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యమును వివరించు ఉత్తేజకర విపుల గ్రంథము.

1/8 క్రౌను. 24 పుటలు. 0-12

14. శ్రీరామకృష్ణ పూజ :

శ్రీరామకృష్ణ పూజావిధానము సహస్ర అష్టోత్తర శత నామములతో నలరారు గ్రంథము.

1/16 డెమ్మీ. 71 పుటలు. 0-50

15. సర్వ సిద్ధాంత సౌరభము : 2 వ భాగము.

దర్శన ఖండము - ద్వితీయ భాగము - వైశేషిక న్యాయములు - శ్రీ కణాద గౌతమ మహర్షుల జీవితకాల సిద్ధాంతములు పండితాభిప్రాయములతో రచితము.

1/8 క్రౌను. 300 పుటలు. 3-00

16. సర్వ సిద్ధాంత సౌరభము : 3 వ భాగము.

దర్శన ఖండము - తృతీయ భాగము - మీమాంసా ద్వయము -శ్రీ జైమినీ వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో రచితము.

1/8 క్రౌను. 340 పుటలు. 3-00

17. సర్వ సిద్ధాంత సౌరభము: 4 వ భాగము.

అద్వైతఖండము - ప్రథమ భాగము - శ్రీ శంకరపూర్వా

ద్వైతము - వేదముల నుండి శ్రీశంకరులవరకు ప్రవహించు అద్వైత రసప్రవాహమును ముందుంచు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు, ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును.

1/8 క్రౌను. 440 పుటలు. రు. **4-25**

18. మాండూక్య రసాయనము:

శ్రీ అనుభవ భాష్యము. 108 ఉపనిషత్తుల ముఖ్య మంత్రములతో, గౌడపాద కారికలతో వ్యాఖ్యాతము.

1/8 క్రౌను. 160 పుటలు. **1-25**

19. సర్వ సిద్ధాంత సౌరభము : 5 వ భాగము.

అద్వైతఖండము - ద్వితీయ భాగము-శ్రీ శంకరాద్వైతము. శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాసప్రాశస్త్య, అధికార వివరములు గలవు.

1/8 క్రౌను. 536 పుటలు. **4-25**

20. సర్వ సిద్ధాంత సౌరభము: 6 వ భాగము.

అద్వైతఖండము - తృతీయ భాగము - శ్రీ శంకరానంతరాద్వైతము-శ్రీ సురేశ్వర విద్యారణ్య వాచస్పతి నిశ్చల దాసాది కర్తల భావవివరణము విపులముగా నిందుండును.

1/8 క్రౌను. 375 పుటలు. **3-25**

21. సర్వ సిద్ధాంత సౌరభము: 7 వ భాగము.

వైష్ణవ ఖండము - ప్రథమ భాగము - (అచ్చులో)